౨౦.

# Veera Prathap.

# వీరప్రతాప్.



## నాంది.

చం॥ జలకములాడఁబోవు గిరి ♦ జాసతియాజ్ఞ గృహాంగణంబునన్
నిలిచిన విఘ్ననాథుఁడు త్రి ♦ నేత్రునిరాకడ నడ్డగించుచోఁ
బ్రళయశిలీముఖంబుల శి ♦ రంబును ద్రెంచి తుదిన్ గుమారుఁగాఁ
దెలిసి సజీవుఁజేసిన ర ♦ తీప్రియదాత శుభప్రదాతయా ॥

మ॥ విపినాంతంబున గూఢజన్ములగుచున్ ♦ వీరప్రతాపాఢ్యులై
తపనీయద్యుతిమోహనాంగులయి మే ♦ ధప్రేషితాశ్వంబుఁదా
మపిధానంబొనరించువారి తనుస ♦ వ్యాగ్రౌఖరింగాంచి పు
త్రపరిజ్ఞప్తినిబొంగు రాఘవుఁడు ని ♦ త్యశ్రీలుమీకిచ్చుతన్ ॥

(పుష్పాంజలిఁజల్లుచు సూత్రధారుఁడు తెరవంకఁ జూచి)

సూత్ర — ఓయీ! పారిపార్శ్వకా! నీవొకసారి యిటువచ్చెదవా?

పారిపార్శ్వ — (ప్రవేశించి) అయ్యా! వచ్చితిని. నన్నుఁ బిలిచిన కార్యమేమి?

సూత్ర — [illegible] విషయగ్రాహులును [illegible]లును, రసాస్వాదనపరాయణులును, సత్కవిత్వప్రియులును నవనాటకకల్పనచాతుర్యధురీణులునగు నీసదస్యాగ్రేసరుల నొక నూతనరూపకప్రదర్శనంబుచే సంతృప్తిపఱుపఁ నీసాయముం గోరి పిలిచితిని.

పారి — మంచిది. ఏనాటకంబుచే వీరినామోదింపఁజేయవలెనని?

సూత్ర — ఏనాటకమా వినుము.

తే॥ గీ॥ వీరకరుణశృంగారరసముల్ గ్రి ♦ [illegible]రి మొంద
నవరసంబులఁ జిలికించి ♦ నాటకముగఁ
దనర రచియించె వీరప్ర ♦ తాప మనఁగ
నాయవటపల్లె హనుమంత ♦ రాయసఖుఁడు ॥

దానినిప్పుడు ప్రదర్శింపనున్నారము.

పారి — అట్లైనచో నాచేఁగల్గు సాయముం జేసెదను రమ్ము!

సూత్ర — లోన నాసోదరుండు వీరసింహుని పాత్రను ధరించుచుండుటచేఁ గొంత కాలయాపనముగా నున్నది. సభాసదులు కాలహరణంబున కోర్వఁజాలరు గావున నేదేని సంగీతకంబుచే వారి నాహ్లాదింపఁజేయుము.

పారి — అయ్యా! దేనింగూర్చి సంగీతక మారంభింతును.

సూత్ర — అదికూడ నేనే చెప్పవలయునా? కానిమ్ము! ఈశరత్కాలచంద్రునిఁ గూర్చి పాడుము.

పారి — శరచ్చంద్రుని వర్ణించుటకు నేను విరహినిగదా?

సూత్ర — విరహిజనానుగుణముగనే పాడుము.

పారి — మంచి దట్టులైన నిప్పుడె యారంభించెదను.

ఉ॥ తమ్ములనేచుచుంట గురు తల్పవిహార వినోదిపట్టటంజి
త్తమ్ము మలీమసంబగుట దానవపూర్గము దూర్చుచుంటదో
షమ్మున క్షుద్రులైన టను ని జపభ సుంపయిలేని రాజశే
ఖ్ధమ్మున కింతగర్వమూచి తంపె? శమిప్రసగతిన్ దలంపుమా॥

( నేపథ్యమున )

సత్యమార్యా! సత్యము!

శా॥ ప్రాజ్యైశ్వర్య మదాంధమానసులు దుర్మార్గావలంబుల్ బుధ
త్యాజ్యుల్ స్వార్థపరాయణ స్వజన పాత్యాసక్తి త్యవిద్వేషులున్
బూజార్హైన నిరాదరిష్ణువులు భూ పుల్ గాంగ లోకంబునన్
రాజ్యాంతే నరకంధ్రువ మ్మనెడి శా స్త్రోక్తుల్ నిరస్తంబులే॥

సూత్రి — (వినుట నభినయించి సహర్షముగా) పారిపార్శ్వకా!
నీరాజశద్బసాదృశ్యంబువలన జందురైన రుసహా అవిఘ్నవర్గనునశు
గాదలంచి మోదంబున వీరసింహుపాత్రను ధరించిన సోదరుం
డరుదెంచుచున్నాడు. ఇక మనము రంగస్థలమునుండి తొ
లగిపోవుదము రమ్ము. (నిష్క్రమించుచున్నారు.)

( ఇది ప్రస్తావన. )

---

( తరువాత వీరసింహుడు ప్రవేశించుచున్నాడు )

వీర — సత్యమార్యా! సత్యము!

"శా॥ ప్రాజ్యైశ్వర్య మదాంధమానసులు" ( అనువెను
కటి పద్యమును మరలఁజదివి )

ఆహా! కాలవైపరీత్యము. ఆంధ్రసామ్రాజ్యలక్ష్మికి మ
ద్భుజస్కంధంబు లాధారంబుఁజేసి యవక్ర పరాక్రమంబున లోక
వర్ధనుండై ప్రజాపరిపాలనంబొనర్చు మావిఘ్నవర్ధనుండేలకో నేడు
విపరీత మార్గావలంబియయ్యె. ప్రజారంజకుండగు రాజు త్రిజగ

తప్పొజ్యాంఁడగుమ. ఆగఁగో రాజశబ్దార్థంబు. స్వజనకంటకుండగు రాజెంత గోర్వులశాలియైనను నాశనదేవత కాహుతిగాకమానఁడు. రాజ్యపరిపాలన చింతాసంకులము. భయోత్పాదకంబు. దుఃఖభాజనంబు. పాపసంపాద్యంబు. కాన భూపాలుండు ప్రజారంజకుఁడైనఁగాని యీపాపసముచ్చయంబును సంహరింపనేరండు. త్రిలింగ ప్రజానురాగంబులు నేఁడు విష్ణువర్ధనునకుఁ బరాఙ్ముఖంబులైనవి. ఇయ్యది పైరిజనానందకరంబు. ప్రజాకల్లోలనిమగ్నుఁడగు మానవేంద్రుని జయించుట శాత్రవులకు సులభసాధ్యంబు. మున్ననేక యుద్ధంబులఁ బరాజితులై పగతీర్చుకొనుటకై వేచియున్న మగధమాళవ పాండ్యకేరళకళింగాది నృపులకిదియే యదను. ఛీ! వారలఁ దూషింపనేల? మా విష్ణువర్ధనుండెంత కృతఘ్నుఁడయ్యెను. ఈతనివర్తన యాంధ్రరాష్ట్రంబునకే కాక మానవకోటికెల్ల లజ్జాకరంబుగా నున్నది. సంకులసమరంబునందెన్నిసారులో యీతనిని గాపాడియుంటిని. దానికిఁ బ్రతిఫలముగా నేఁడు నన్నే యీవిధంబుగఁ జూచుచున్నాఁడు. రాజ్యభ్రష్టుఁడై కాననంబులఁ దిరుగాడుచున్ననాఁడు మగధ మాళవాధీశులతోఁ బోరి తిరిగి వీనిని సింహాసనాసీనునిం జేసినదెవరు ?

సీ॥ రిపులచే రాజ్యాప ♦ హృతుఁడైయై కానల
నిలువనీడయు లేక ♦ మెలఁగునాఁడు
మగధ దేశాధీశు ♦ మదగజేంద్రములెల్లఁ
గల్యాణపురి నరి ♦ కట్టునాఁడు
మాళవాధీశ్వర ♦ మహాసైన్యతరంగ
ములఁ ద్రిలింగావని ♦ మునుఁగునాఁడు
ఆంధ్రసామ్రాజ్య పే ♦ రాంచితస్థితినంద
యవనాదినృపులఁ జెం ♦ డాడునాఁడు

గీ॥ వాంఛితంబగు మామక ♦ బాహుబలము

ఉచ్చైశ్శ్రవమ్మాకె ♦ నూడఁదన్నఁగజాలు
రంగదుత్తుంగ క ♦ ర్కంపువాజి
వాయువేగము త్రోసి ♦ పందెమొందిజయించి
రమణఁ జేకూర్చుతు ♦ రంగమంబు
ఇంచువిల్తునితేరు ♦ నెక్కసక్కెముఁ జేసి
యొప్పారు పంచభ ♦ ద్రోత్తమంబు
గీ॥ ఎడవాయలేక్కొచ్చి సు ♦ కెన్ని విధులఁ
పట్టపట్టనఁగాని ఓ ♦ కాశపడదు
నేఁడునన్బాసి యెంతి క ♦ న్నీరుగార్చు
చుండునోకాని వారికా ♦ యుసురుచాలు ॥

నేనిప్పుడెందుఁబోవుదును ? ముందుకుఁబోయి వారియుపకృతికిందగు ప్రతిక్రియఁగోరుదునా ! వచ్చినదారినే పోదునా ? ఛీ ! ఛీ ! యిది యేటిలక్షణము.

తే॥ ప్రాణసమ్మైన పంచక ♦ ల్యాణినెవఁడో
వంచనమొనరించి కొనిపో ♦ వంగఁజూచి
పౌరుషవిహీనముగ నెటు ♦ బారకుందుఁ
బరకృత తిరస్కృతులసైఁచు ♦ వాఁడుగలఁడె ॥

ఛీ ! యిట్టి యెడఁబరాకప్రవృత్తియే కర్తవ్యాంశము. ఈ చిహ్నంబుల ననుసరించి పోయినచో నాయశ్వమున్నతావునకుఁ బోయెదను. (కొంచెము ముందునకేగి) ఓహో ! ఈమార్గంబు కళింగరాజధానియగు కళింగపురంబునకుఁ బోవును. తుచ్ఛుండగు కళింగదేశాధీశ్వరుండు నన్ను వంచించుటకై యిట్టికృత్యంబును జేయించియుండును. ఓరీ ! కళింగవంశపాంసనా ! ఇదియా నీప్రతాపము ! అన్యాయముగ సుప్తుండనై యుండఁగా బాధింపఁబడియున్న తురంగంబును జోరునివలెఁ గొనిపోవ శూరతయనుకొంటివిగాఁ బోలు ? ఇంతమాత్రముననే వీరసింహుని జయించినట్లుగాఁ దలంచితివిగా ! ఛీ !

# పీఠిక.

—,o,—

ఆంధ్రసోదరులారా !

నేనీనాటకము నాంగ్లేయకవిశేఖరుఁడగు "మాత్యూఆర్నాల్డు" వ్రాసిన "సోరబ్ & రుస్తుమ్" (Sohrub & Rustum) అను పద్యకావ్యమును బరిష్యాదేశపుఁగథలలోని వీరపూర్వగాథయును మూలముగాఁగొని నాటకమున కనుకూలమగునట్లును మనదేశపద్ధతులకును నభిప్రాయములకును వీలగునంతవఱ కనుగుణముగా నుండునట్లును గథనుమార్చి వ్రాసితిని. అన్యదేశీయనామములు చిత్తాకర్షకములుగా నుండఁజాలవేమోయను తలంపున నవిమార్చి యాంధ్రదేశనామములను నాంధ్రరాజుల నామములను గల్పించి యాంధ్రదేశములో జరిగిన కథవలెఁ జిత్రించితిని.

దీనిని శ్రీ రామమోహన్ థియేట్రికల్ క్లబ్ ప్రొప్రైటరును నామిత్రుఁడును బంధువునగు మ॥ రాఁ॥ శ్రీ॥ తురగా నరసింగరావుపంతులుగారి ప్రోత్సాహమున 1919 సం॥ న రచించితిని. 1923 సం॥ అక్టోబరు 6 వ తేదీని బ్రథమపర్యాయము దీనిని దక్లబ్ వారిచే జయప్రదముగాఁ బ్రదర్శనమొనరింపఁజేసి నాకానందమును గలుగఁజేసిన నరసింగరావుపంతులుగారి కనేకవందనములు.

ఈనాటకమును వ్రాఁతప్రతిగానున్నప్పుడు కడుశ్రద్ధతో సవరించియిచ్చుటయేకాక ముద్రణయగుచున్నప్పుడు (Proofs) కూడ విసుగుఁజెందక కడుశ్రద్ధతో మిత్రవాత్సల్యమున దిద్దియిచ్చిన బ్రహ్మశ్రీ నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారి కనేక కృతజ్ఞతాభివందనములు.

నాటకరచనకిదియే ప్రథమ ప్రయత్నమగుటంజేసి దోసఁగులుండవచ్చును. ప్రాజ్ఞులు దోసఁగులెన్నక సుగుణములనే గ్రహింతురను తలంపున నాంధ్రలోకమునకీ కృతిని సమర్పించుచున్నాఁడను.

ఇట్లు,
బుధకవిజనవిధేయుఁడు.

మచిలీపట్టణము
20-11-24

ఆవటపల్లె హనుమంతరావు.

# కథాసంగ్రహము.

1 వ అంకము :—

విష్ణువర్ధనుండను రాజు త్రిలింగదేశమును దనపినతండ్రికుమారుఁడును సేనాధిపతియునగు వీరసింహుని పరాక్రమముతోడుగాఁ బరిపాలించుచుండును. కాని రాజు దుర్మార్గావలంబియై తనసేనాధిపతియగు వీరసింహునితోఁ గలహింపఁగా నాతఁడు ప్రజలపక్షమువహించి రాజును స్వాధీనముచేసికొనుటకై కృత్రిమకోపంబునఁ బురమునుండి వెడలిపోయి కళింగపురిపరిసరారణ్యముల నివసించుచుఁ జారులచే వృత్తాంతముల నారయుచుండును.

ఇట్లుండఁగా నొకనాఁడాతని యశ్వము నెవ్వరో రహస్యముగాఁ గొనిపోవుదురు. తురంగరింఖాముద్రిత చిహ్నములచే నాదారి కళింగదేశమునకుఁ బోవు మార్గంబుగా గుర్తించుచు కళింగాధిపతి స్వాతంత్ర్యమునకై పలుమాఱాంధ్రులతోఁ బోరాడి యోడిపోవుచుండుటచేఁ దనగుఱ్ఱము నాకళింగాధీశుఁడే కొనిపోయియుండునని తలంచి వానిపైనాగ్రహమున్న వానిపట్టణములోనికిఁ బోవుచుండఁగా నప్పుడే వేఁటకై వచ్చిన కళింగదేశాధిపుండగు మాధవవర్మ యరణ్యములోఁ దన పూర్వపరాజయంబులఁగూర్చి తనమంత్రితో యోజించుచు విష్ణువర్ధనునితో వీరసింహుఁడు కలహించి కాననంబులకరిగెననివిని, రాజు వానితో నేవిధంబుగానైనఁ జెలిమిఁజేసి వానిసాయంబున నాంధ్రరాష్ట్రంబుపై దాడివెడలితిమేని జయింపఁగలమని యుల్లసిల్లుచుండ వీరసింహుఁడేవచ్చి వారలఁ గలిసికొనును

తరువాత వీరసింహునకును వానికిని గొంతవాగ్వాదముజరుగ మాధవవర్మ తానునిర్దోషినని తెల్పి తనరాజ్యమునం దెచ్చటనున్నను వానిగుఱ్ఱమును దెప్పించి యీయఁగలవాఁడనని వాగ్దానముఁజేసి వానిని దనపురంబునకుఁ గొనిపోయి గుఱ్ఱమును వెదకుటకై సైనికులఁ బంపును.

2 వ అంకము :—

ఇదివఱకే మాధవవర్మ కుమార్తెయగు జగన్మోహిని వీరసింహుని బాహుబలశౌర్యాతిశయములఁ గూర్చి విని వానినే వరించినను నాతఁడు తన తండ్రికి విరోధియగుటచే నదియసంభవమని తలంచినది నేఁడు వీరసింహునకును దనతండ్రికిని మైత్రికల్గుటచేఁ దనకోర్కె నెఱవేఱవచ్చునని సంతసమున నుద్యానవనములోనికిఁ జెలికత్తెయగు చతురికతోఁ దనభావములఁ దెలియఁజేయవలయునని తలంపున వచ్చును. చతురమతియగు చతురిక తనచెలిమనోభావముల నిదివఱకేయెఱింగియుండుటచేత మాగధేయులచే నశ్వమును దొంగిలింపఁజేసి యాకారణంబున వీరసింహుఁడు తమపురంబునకు వచ్చినప్పుడు జగన్మోహినితో సమావేశమును గల్పింపవలెనని యోజనఁజేయును. తాననుకొనినట్లు వీరసింహుఁడు తమపురంబునకువచ్చుటచే జగన్మోహిని నారాత్రి వీరసింహుఁడు శయనించు వసంతమందిరములోనికిఁ గొనిపోవును. వీరసింహుఁడంతకుముందా మందిరమందున్న మోహినీ

చిత్రపటమునుగాంచి, మోహించి నాఁటిరాత్రి స్వప్నములోఁ బటమునందుఁగాంచిన విగ్రహమునే చూచినవాఁడై విస్మయచిత్తంబున నావెంగూర్చి తలంచుచుండఁ గాంతపటంబున కావలనుండి వీక్షించుచున్న మోహినీచతురిక లిర్వురును బ్రత్యక్షమై తమమనోగతమును దెలియఁజేయుదురు వీరసింహుఁడు తొలుదొల్త నిష్టములేనివానివలె నటించినను జివరకు మాధవవర్మ యనుమతినిఁ బొంది వివాహమాడుదునని చెప్పి వారలఁ బంపివేయును

తరువాత నావెనుఁగూర్చి స్మరించుచుండ మాధవవర్మయును మంత్రియును వచ్చి యాతఁడెవ్వతెనుఁగూర్చియో స్మరించుచున్నట్లు తెలిసికొని యావృత్తాంతము నడుగఁగా నాతనికుమార్తెనే వరించినట్లును నాకె నిచ్చి వివాహము నొనర్పవలెననియు మాధవవర్మను గోరును దానికి మాధవవర్మ తన యవసానసమయమునందుఁ దన కుమార్తెను దనయింట నుంచుకొను నియమముమీఁద వివాహముఁ జేయును.

3 వ అంకము :—

గుఱ్ఱమును దొంగిలించుకొనిపోయిన మాగధీయులు పట్టువడ విచారణలో దీనికంతకును గారకురాలు చతురికయని సిద్ధపడును చతురికయొక్క సాహసమునకై వీరసింహుఁడామెను క్షమించి మాగధీయులను విడిచిపెట్టును.

తరువాత మాధవవర్మ తనకుఁ బుత్త్రులులేని కారణంబున నల్లుని పనపురంబుననేయుండి తన రాజ్యమున కధిపతిగావలసినదని కోరఁగా నందులకు వీరసింహుఁడు సమ్మతింపకుండును మఱియు మాధవవర్మ తాను గోల్పోయిన స్వాతంత్ర్యము నపేక్షింపఁగా ధీభుజబలంబులచే దాని వారింపుమని యల్లుఁడు చెప్పపాడువఁ బరిభవక్లేశంబున నాఁటి కొలువుచాలించును.

4 వ అంకము :—

ఆంధ్రరాష్ట్రంబుపై మాగధీయులు దండెత్తివచ్చుటచే విష్ణువర్ధనుని కోరికచేఁ దిగ్విక్రముఁడొక లేఖను బంపును వీరసింహుఁడా లేఖను జదువుకొని తత్క్షణమే తనదేశ సంరక్షణమునకైపోవ సంసిద్ధుఁడై గర్భవతిగానున్న తన భార్యవద్దకువచ్చి తనయుద్ధాభిగమనమును దెలియఁజేయుచుఁ బురుషశిశువుగల్గినచో వెంటనే తనకుఁ దెలియఁజేయవలెనని యొకరక్షనిచ్చి వెడలిపోవును

తరువాత జగన్మోహిని భర్తృవియోగదుఃఖమున మునింగి పురుషశిశువు పుట్టిననే తెలియఁజేయుమనుటకుఁ గారణమేమని చతురికతో నాలోచింపఁగాఁ బురుషశిశువుపుట్టిన వానిని గొంపోయి తనవలెనే యుద్ధసన్నద్ధుని జేయవలెనని యట్లుచెప్పియుండునని తలంతురు బర్త కుఁదోడు కుమారునిఁగూడఁబాసిన మఱింతదుఃఖముగానుండునని పుత్త్రుఁడ జన్మించినచో స్త్రీశిశువేజన్మించెనని తెలియఁజేయుటకు నిశ్చయించుకొందురు

5 వ అంకము :—

జగన్మోహినికిఁ గుమారుఁడుపుట్టఁగా స్త్రీశిశువు జన్మించినదని రణగంగము

డంచున్న వీరసింహునికి వార్త నంపుదురు. ఈవర్తమానమును గొనిపోయిన బ్రాహ్మణుఁడు కళ్యాణపురమున యుద్ధమొనర్చి సాయంసమయమున నింటికివచ్చు వీరసింహునికిఁ బుత్త్రిక జననసమాచారము తెలియఁజేయును. ఇంతలోఁ దనతండ్రికిఁ జాలజబ్బుగానున్నదని ప్రియదాసనువానిచే వర్తమానమురాఁగా రాజవిధి పిత్రాదేశములయందలి ముఖ్యకర్తవ్యమెద్దియో నిర్ణయింపఁ దుదకు రాజవిధినే కర్తవ్యముగానెంచి యుద్ధమాగిపోయి సంధిగుదిరినమీఁదఁ దండ్రివద్దకుఁబోవును

6 వ అంకము :—

మోహినికుమారుఁడైన ప్రతాపసింహుని యస్త్రవిద్యాప్రదర్శనము జరుగును మాధవవర్మ వానిని సర్వసైన్యాధిపతినిఁజేయును ప్రతాపసింహుఁడు తనకు వీరసింహుఁడు విరోధియగుట వానినిజయింపఁ బంతమూనును వసంతుఁడను తన మిత్రుని ప్రోత్సాహమునఁ బ్రతాపసింహుఁడు తల్లివద్దకరిగి తనతండ్రింగూర్చి యడుగును చివరకు వీరసింహుఁడే తనతండ్రియని తెలిసికొని యాశ్చర్యపోవును విజయయాత్రమొనర్చుచుఁ దండ్రినిజూడఁబోవుట కనుజ్ఞగోరఁ దల్లి యొప్పకుండును. మాధవవర్మవచ్చి శత్రువాఁడు యుద్ధమునకేగినచో వీరసింహుని జయింపఁగలఁడనియు నొకవేళఁ గుమారుఁడేగతించినచోఁ దదుపరి తనకుమారునిగానెఱింగి వీరసింహుఁడు ప్రాణత్యాగ మొనర్చుకొనుననియు నీరెండు విధములను రాజ్యము తన కవలీలవశముగాఁగలదను దురుద్దేశమున మనుమనిప్రోత్సాహ మొనర్చి కుమార్తెకెట్టులనో చెప్పి యుద్ధమునకుఁబంపును మోహిని తండ్రియొక్క దురుద్దేశమెఱింగి దుఃఖావేశమున వెడలిపోవును

7 వ అంకము :—

చాళులవలన యుద్ధములు చాలించి విశ్రాంతిఁబూనుచున్న వీరసింహుఁడు చండీశ్వరీగణపతులోడిన సమాచారమువినును తరువాతఁ గళ్యాణపురమును బ్రతాపసింహుఁడు ముట్టడించినంతనే విష్ణువర్ధనుఁడు త్రివిక్రమాదులను వీరసింహుని గొనిరావలసినదని పంపును. త్రివిక్రమాదులువచ్చి తమభంగపాటును బ్రతాపుని బాహుబలపరాక్రమమును వర్ణించి వీరసింహుని యుద్ధమునకు రావలసినదని ప్రార్థింతురు వీరసింహుఁడు వారలకు దూషణభూషణంబులఁ బౌరుషంబుఁ బుట్టించి యెట్టకేలకు మాఱువేషమున యుద్ధమునకు వచ్చెదననియు దానువచ్చుచున్న సంగతి నెవరికిని దెలియనీయవలదని చెప్పిపంపును. తరువాత జగద్విఖ్యాతివడసిన తానొకబాలునితోఁ బోరుట హాస్యాస్పదముగా నుండునని తనవేషము నంతయు మార్చుకొని యుద్ధమునకుఁబోవును.

8 వ అంకము :—

ప్రతాపసింహుఁడు వసంతగణపతులతో రణరంగమునఁ బ్రవేశించును ప్రతాపుఁడు తనతండ్రి సంచరించినభూమిని బ్రవేశించినతోడనే పితృవ్యామోహముకలుగ వసంతుఁడు వానిమనంబును గుదుటఁబఱచును. ప్రతాపుఁడు శత్రు

శిబిరములఁగాంచి వివరమును గణపతిని బ్రశ్నించుచుండ నింతలో వీరసింహుఁడే కోపావేశమున మండిపడుచు వచ్చి ప్రతాపునిగాంచినంతనే యపరిమితానందమును జాలియుఁగలుగుటచే యుద్ధప్రయత్నమును మాన్పుటకై ప్రతాపునెంత బతిమాలినను వినక వీరసింహునిఁ దూలనాడును వేఱుమార్గములేక వీరసింహుఁడు యుద్ధమునకు దిగును. తొలుదొల్త వీరసింహునకే జయముకల్గినట్లుగాఁ గాన్పించినను జివరకు బ్రతాపసింహుఁడే రెండుమూఁడుమాఱులు తండ్రినోడించును

కొంతవడికిఁ దనతో యుద్ధమొనర్చుచున్నవాఁడు తనతండ్రి కావలయునని యనుమానముదగిలి వీరసింహుఁడవాయని యెన్నిపర్యాయము లడిగినను బరిభవక్లేశంబునఁ జెప్పకుండును. బాలునిచేఁ బరిభవింపఁబడుటచేఁ గోపావేశమున నధర్మముగాఁ బ్రతాపునిఖడ్గముతోఁ బొడుచును. బాలకుఁడు తానుజచ్చిపోవునప్పుడు తాను వీరసింహుని కుమారుఁడనని చేతనున్నరక్షను జూపును. వీరసింహుఁడారక్షను దాను దనభార్యకు మున్నొకప్పుడిచ్చినదని గుర్తించి తనకన్నకుమారుని జేతులారఁ జంపుకొంటినని దుఃఖించును. ప్రతాపుఁడు దుఃఖముతోఁ దండ్రిని గౌఁగలించుకొని యాతఁడు వెంటనేపోయి తనతల్లినోదార్పవలయుననియుఁ గళింగసైనికులనెల్ల క్షమించి పంపవేయవలసినదనియుఁ గళింగదేశమునకు స్వాతంత్ర్యమొసంగ వలయుననియుఁ దండ్రినిగోరి ప్రాణములువిడుచును.

అంతఁ బుత్త్రమరణ దుఃఖావేశమున వీరసింహుఁడు మూర్ఛిలిపడిపోవును. త్రివిక్రమాది పౌరులెల్లరును గుజ్జువాని నామము శాశ్వతముగా నుండుటకై కృష్ణాతటంబున వానిసమాధిగట్ట నిశ్చయించుకొందురు. తదుపరి వీరస్వర్గమలంకరించిన ప్రతాపునియాత్మశాంతికై దేవుని బ్రార్థింతురు, భరతవాక్యము. శ్రీ శ్రీ. శ్రీ.

---

## —. శుద్ధపత్రిక. .—

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 17 | 16 | గావున | కావున |
| 39 | 18 | సూన్యు | శూన్యు |
| ,, | 24 | డొర్లి | దుల్లి |
| 40 | 19 | కరుండయి | కరుండనయి |
| ,, | 19 | రంక్షింప | రక్షింప |
| 47 | 1 | ద్నునట్లు | దున్నట్లు |
| 66 | 6 | కూడపం | కూడఁబం |
| 73 | 2 | చెట్టుఁబట్టి | చెట్టువట్టి |
| 85 | 24 | సౌష్టవ | సౌష్ఠవ |
| 104 | 14 | జగజెట్టి | జగజెట్టి |

# ఆయా యంకములయందు వచ్చు పాత్రలు.



పురుషులు :—　　　　　　　　　　　అంకములు.

1. సూత్రధారుఁడు — ... ... 1.
2. పారిపార్శ్వకుఁడు — ... ... 1
3. వీరసింహుఁడు-కథానాయకుఁడు— 1, 2, 3, 4, 5, 7, 8
4. మాధవవర్మ - కళింగదేశపు రాజు — 1, 2, 3, 4, 6.
5. ,, మంత్రి — ... 1, 2, 3, 4.
6. బ్రాహ్మణుఁడు — ... ... 5.
7. ప్రియదాసు — ... ... .. 5,
8. రాయబారి — ... ... ... 5.
9. వసంతుఁడు — ... ... ... 6, 8.
10. ప్రతాపసింహుఁడు-కథానాయకుని కుమారుఁడు— ౮, ౩.
11. గణపతి —... ... ... ... 8,
12. త్రివిక్రముఁడు —... ... ... 7. 8.
13. యోధులు — (అయిదుగురు) ... 7.

వీరుగాక యిరువురుచోరులును గొందఱు సేవకులును వత్తురు.

స్త్రీలు :—

1. జగన్మోహిని - కథానాయిక — ... 2, 4, 6.
2. చతురిక — (చెలికత్తె) ... ... 2, 3, 4, 5.
3. మాలతి — ,, ... ... 5,



Avatapalli Hanumantha Rao.

AUTHOR, Masulipatam.

ఉ॥ ఎక్కడివీరసింహుఁడిఁక ♦ నెక్కడియోటమి యోడిపోయినన్
జుక్కలురాలఁగావలెను ♦ సూర్యుఁడు ప్రాగ్దిశఁగ్రుంకఁగావలెన్
దిక్కులు నూఁగులాడవలె ♦ దేశమునందిటువంటి వెప్పుడే
నెక్కడఁగాని కాంచనిదె ♦ యేటికినీకిటువంటి దుర్భ్రమల్ ॥
అంతియేకాదు

మ॥ రిపుమధ్య స్థితుఁగాఁగఁ జేసినను దు ♦ ర్భిక్షంబుఁ జేకూర్చినన్
విపదబ్ధిన్ మునిఁగింపఁజేసినఁ జెఱన్ ♦ బెట్టించిబాధించినన్
విపరీతంబగు క్రూరకృత్యములచే ♦ నిర్జీవుఁగాఁ జేసినన్
గపటోపాయములన్ జలింతురొకో ని ♦ క్కంబైన ధీరోత్తముల్॥
కానిమ్ము వీరసింహునితోడి చెల్లాటము సాహసించితివిగా ! నేఁడు, మత్కరాళ దంష్ట్రాప్రసజ్వాలల నెట్లుతప్పించుకొనెదవో చూచెదఁగాక !

శా॥ ఓరీ ! నీచకళింగుఁడా నృపులు లే ♦ రోమున్ను పృథ్వీస్థలిన్
వారిరీతిఁజరించిరో ! తుది భయ ♦ భ్రాంతస్వభావంబునన్
బారుంబోతుతనంబుఁ జూపుచునభో ♦ భాగంబునన్ దాఁగినన్
బారావారముఁ జొచ్చినన్ విడుచునే ♦ నైశిత్యనారాచముల్॥
ఏటికీతొందర ! ఒకవేళనాపురంబున లేకున్న నేనేమిచేయవలెను ? అట లేకున్న నేమి ?

మ॥ సగరక్ష్మాపతి సూనులామొడ మఖా ♦ శ్వంబెందుఁగాన్పింపమిఁ
దెగువన్ బూని ధరిత్రిఁ ద్రవ్వరొకో ! త ♦ దీత్రిన్ దృఢవ్రిజ్ఞలన్
గగనక్ష్మాతలమధ్య సీమనెటను ♦ న్నన్ దెత్తుఁదేకుండనే
మగుడన్ వచ్చితి నేనిమాతృపదప ♦ ద్మద్వంద్వముస్ద్సప్పెదన్ ॥
( దిక్కులు పరికించి ) అదిగో యెవ్వఁడోవచ్చుచున్నవాఁడు. వాఁడేమైన నీజాడల నెఱుంగునేమో కనుఁగొనెద !
( ముందునకునడచి ప్రకాశముగా ) ఎవఁడురావచ్చునది ?

సేవకు — మాధవవర్మ మహారాజుగారి సేవకుఁడను.

వీరసింహ — నీవిందేల తిరుగుచున్నావు ?

సేవకు — మహారాజుగారును మంత్రిగారును వేటకై యీప్రాంత
ములకు వచ్చియుండిరి. వారివెంట వచ్చితిని.
వీర — ఇప్పుడు వారెక్కడ నున్నారు?
సేవకు — ఆయాసపడుచు నొక వృక్షనీడను వేటబడలికను దీర్చుకొను
చుండవచ్చును. [నిట్టూర్చుచు] ఈదారిగ బోయినచో వా
రలను దర్శనము గలిగించెదను. పోదము
వీర — మంచిది ఇటునే పోయెదను (నిష్క్రమించును)
సేవ — (తనలో) ఈయన డెవ్వడో కోపముతో నున్నట్లున్నాడే?
అదిగో మహారాజుగారలే వచ్చుచున్నారు. ఈవృత్తాంతము
వారికి నివేదించి పోయెదను. (ముందునకు బోయి) మహా
స్వామీ! దండములు. (నమస్కరించుచున్నాడు)
మాధవ — సేవకా! ఏమి సమాచారము?
సేవకు — అయ్యా! తమకొఱకెవ్వరో వచ్చి యామఱ్ఱిసమీపము
నకు బోయిరి.
మాధవ — మంచిది. మేమును నక్కడికే పోవుచున్నారము
లెమ్ము. నీవు సత్వరంబుగ బురిలోనికిబోయి నేటి మధ్యా
హ్నము వచ్చుచున్నారమని తెలియజేయుము.
సేవ — చిత్తము స్వామీ! (అని వెడలును)
మాధవ — మంత్రీ!

ఉ॥ పోరులు సల్పి సల్పి విసు ♦ వున్మది నందు టెకాని గెల్వగా
నేరదు త్రిలింగనాథుని దృ ♦ ణీకృత శాత్రవ వీరసింహుడు
వ్వారల కండయై నిలువ, వారి జయించు నుపాయమున్న బెం
పార వచింపు మయ్య సుగు ♦ ణాకర మామక మంత్రిశేఖరా॥

మంత్రి — రాజా! దీనికై మీరింత చింతింపనేల. జయాపజ
యంబులు దైవాధీనంబులు.

ఉ: ఫాలతలంబున న్నలువ ♦ వ్రాసిన వ్రాతలు గీత వెట్టగా
జాలుదురెవ్వరేభువి వి ♦ చారణసేయ మొకింత యోక్షితీ

పాలక ! కాలకర్మపరి ♦ పాకము దీరినమీఁదఁగాని రాఁ
జాలవు భాగ్యభోగ్యములు ♦ సర్వ యశఃప్రతిభావిశేషముల్ ॥

అయిన నదృష్టకాలమాసన్నమగుతఱి సర్వము శుభ సూచకంబుగనే కాన్పించు. దేవా ! మనవైరిలోకంబునుండి నేఁడొక శుభవార్త వింటిని.

మాధవ — ఏమని ?

మంత్రి — విష్ణువర్ధనునకును బ్రజలకును మనోవైకల్యములుగల్గ వీరసింహుఁడాగ్రహంబున రాజుతోఁ గలహించి కాననాంతరమునకు వచ్చెననివింటి. కావున మనమావీరసింహుని నేయుపాయములచేనైన మనలోనికిఁదీసికొని త్రిలింగరాష్ట్రముపైదండెత్తితిమేని ప్రజానాయకులలోఁ బెక్కండ్రు రాజవిరోధులగుటంజేసి మనకు సాయపడఁగలరు. కాన మనమాప్రయత్నమునమంటిమేని జయప్రాప్తి కనుకూలించును

మాధవ — సచివా ! నీయుపాయంబు చక్కఁగానున్నది. (ముందునకుఁజూచి) మాటలమధ్య దూరమగపడకయే మననిలయంబున కెంతత్వరలో వచ్చితిమి.

మంత్రి — (ముందునకుఁజూచి)

చం॥ ఘనతరదీర్ఘబాహువులఁ ♦ గార్ముకబాణములన్ ధరించుచున్
గనకమణిప్రభామకుట ♦ కాంతులు మోమునఁ గెంపునింపఁగాఁ
గనదురువిస్ఫులింగములు ♦ గన్నులఁ గ్రాలఁగఁ బండ్లుగీటుచున్
జనవర ! వచ్చునిల్వెను హ ♦ జారమునందొకవీరుఁడెవ్వఁడో ॥

మాధవ — బహుశః వీరసింహుఁడై యుండునా ! ఏమో ! వెదకఁబోయినతీఁగె కాలికిఁదగిలినట్లు మనమువిశ్వప్రయత్నముచేఁగొని రాఁదలంచిన వీరసింహుఁడు మన యదృష్టవశమున నిటకే వచ్చెనేమో ! (ముందునకుఁబోయి చక్కఁగానుపలక్షించి) అవునదిగో ! నిజముగా వీరసింహుఁడే వచ్చుచున్నాఁడు.

మంత్రి — అటులైనచో వానికెదురేగి సత్కారమునఁ గొని వత్తమురండు. (అని యిరువురును ముందునకుఁ బోవుదురు)

మా— తే॥ మహసగర్వధుర్య! రాజ్యసం ♦ స్కారధుర్య!
అమరసింహాభిధాన! వి ♦ ద్యానిధాన!
సుగుణసౌందర్యశౌర్య సం ♦ స్తూయమాన!
అందుకొనుమయ్య! నిజ సు ♦ స్వాగతంబు॥

[ వీరసింహుఁడు ప్రవేశించును ]

వీర — (కోపస్వభావముతో) ఓరీ! కళింగకులకళంకా! ఏమీ! నీ నక్కవినయములు.

ఉ॥ క్రొవ్వున వేఁటవచ్చి యొక ♦ కాననసీమను విశ్రమింపఁగా
మ్రుచ్చులఁ గొంతమందినటఁ ♦ బుచ్చి మదీయతురంగరాజముఁ
దెచ్చి మఱుంగుఁ జేసి కడు ♦ దీనతఁ జూపుచు నంగనాచివై
వచ్చితె స్వాగతంబనుచు ♦ వహ్వరె? రాజకులాధమాధమా॥

(పండ్లు పటపటఁ గొఱుకును)

మాధవ — (సవినయముగా)

ఉ॥ ఏమిటికీదురాగ్రహ మొ ♦ కించుక శాంతివహింపుమయ్య! త
ప్పేమిటఁ గల్గె మా యెడ? స ♦ హీనపరాక్రమసింహ! తెల్పియా
పైమముఁ దిట్టఁగాఁ దగును ♦ భావ్యమె యూరకె యిట్టులాడఁగాఁ
దామస దీర్ఘకోపము ల ♦ ధర్మగుణంబులు నార్యనింద్యముల్॥

వీర — ఏమీ! నీకేమియుఁ దెలియదా? అవును! ఎవరిదుష్ప్రవర్తనలు వారి మనోనేత్రములకెట్లు గోచరించును? ధీరోత్తములగువారల బాహుపరాక్రమంబుచే జయింపఁజాలక కృత్రిమోపాయంబుల వంచింప సాహసించితివిగా. ఇదిగో!

మ॥ ఇనుఁడస్తాద్రికిఁ జేరులోపల హయం ♦ బీవన్న యుష్మచ్ఛమూ
వనధిన్ మంథరపర్వతంబటుల మ ♦ ద్బాహాబలప్రౌఢి మం
థనముం జేసి గ్రహింతుమత్తురగముం ♦ దథ్యంబుగానన్ వినా
శనముం జెందఁగనేల చూచెదవు రా ♦ జ్యభ్రష్టతన్ మాధవా!॥

మాధవ— ఆహా ! వీరసింహుఁడా ! నిష్కారణవైరమ్మున కేలకాలు దువ్వెదవు ? మేము నిక్కముగా నీతోఁ జెలిమి కాసించినవార మేకాని నీకుఁ బ్రత్యర్థులమైయుండ నేరము. నీహయరాజంబు నారాజ్యమునం దెచ్చటనున్నను దెప్పించి యీయఁగలవాఁడను. ఈవీరహార్యుడు క్రోధానలజ్వాలాకారకుండగు దురాత్ముని మత్సునిశిత కరాసిధారమునై చెద. ఇదేమత్సేవకుల నంపి పురమెల్ల వెతకించెద. ( మంత్రిదిక్కు ) మంత్రీ ! మనరాష్ట్రమెల్ల గాలించి త్రిలింగసామ్రాజ్యధురంధరుఁడును దుర్వారవైరిగర్వాపహార శౌర్యధుర్యుండునగు నీవీరసింహుని పంచకల్యాణి యెందున్నదో తెలిసికొన మన సేవకులనుబంపి వారమురినములలోఁ దత్సమాచారము నరయునట్లు చేయుము. అట్లొనర్పరేని వారిప్రాణంబులుండ నేరవనిచెప్పుము.

మంత్రి — చిత్తము ! ఇప్పుడేపంపెదను

వీరసింహ — ( తనలో ) ఓహో ! యీతని వినయోచిత వాక్యంబులును వీరసంభాషణయుం జూడ నీతఁడు నిర్దోషిగాఁ దోఁచుచున్నది. ( ప్రకాశ ) రాజా ! నిజముగా నీవేమియు నెఱుంగవా ?

మాధవ — నిజముగా నేనేమియు నెఱుంగను.

వీర — ఏమో కానిమ్ము ? నిజానిజము లిప్పుడే బయల్పడఁగలవు.

మాధ— వీరసింహా ! నీవట్లనే పరీక్షింపవచ్చును.

వీర — (తనలో) అట్లైనచో నింక శాంత స్వరూపంబు దాల్చుటుచితము. (ప్రకాశముగా) రాజా !

మ॥ స్థిరమైనిల్చిన పూర్వవైరమును సా ♦ ధింపంగనేతద్విధిన్
జోరవర్గంబౌని యొనర్చియుందువని యు ♦ ద్రేకప్రతాపంబునన్
బరుషాలాపములాడి మీామదికి సం ♦ తాపంబుగల్గించు దు
స్తరదోషంబొనరించి నాఁడవని ప ♦ శ్చాత్తాపమ్మున్ జెందితిన్ ॥

మాధవ — ఆంధ్రనాయకా! క్రూరనారాచసమంబులగు నీవచనంబు లెట్టి మానిసినేని కుపిత మానసుని జేయక మానవు. కాని వైరిలోక మధ్యస్థితుండవయ్యును నీమనోధైర్యంబతిప్రశంసనీయము శాంత చిత్తులగువారి కెట్టి కోపంబులును జనింపనేరవు.

తే॥ కుత్సితోపాయమెందుఁ జే ♦ కూర్పలేదు
బాహుబలసంపదలవెందుఁ ♦ బనికిరావు
కాని జగతిని సంస్థాయ ♦ మానమైన
శాంతవృత్తి గెలుచుఁ బర ♦ స్వాంతములను॥

నీవుపశ్చాత్తాప కలిత మానసుండవైతివి. మాకదియే పరమ సంతోషము. ఇఁక గతమునుమఱచిపోయి మిత్రభావంబున మెలంగుదము.

వీర — ఆకోర్కె సంతోషదాయకమేకదా!

మాధవ — వీరసింహా! యిచ్చటికనతిదూరంబుననే మానివాసంబును గలదు. వసంతకాలమగుటంజేసి పరిజనసహితంబుగా నీపురబాహ్య ప్రదేశమందలి వసంతోద్యానమందిరంబుల నివసించుచున్నారము. నీవును హయాన్వేషణార్థమరుగు సేవకులువచ్చుదనుక నాయింటివిందవైయుండి నన్నుగృతార్థునిం జేయఁబ్రార్థించెద.

వీర — రాజా! నిరభ్యంతరముగా నీయభీష్టము నెఱవేర్తుఁగాక.

మాధవ — ధన్యాత్ముఁడనైతిని. వీరసింహా! అట్లయినచోఁ బ్రొద్దెక్కుచున్నది. ఇప్పుడేపోవుదము రమ్ము (అని ముగ్గురును బయలుదేఱుదురు.)

ఇది ప్రథమాంకము.

శ్రీ



# Veera Prathap.

# ✿ వీరప్రతాప్. ✿

## ద్వితీయాంకము.

### —♦ ఉద్యానవనము. ♦—

[ జగన్మోహిని ప్రవేశించి ]

సీ॥ వికసిత నవసుమా ♦ విర్భూత గంధంబు
మైసోఁకి నంత నై ♦ మఱపుగూర్చు
నినకాంతి నడఁగించు ♦ నిగురుజొంపములు సుం
దరములఁ జలువ పం ♦ దిరులొసంగు
స్మరశరానలతప్త ♦ మానవాంగములకు
శశికాంతమణులు వి ♦ శ్రాంతిగూర్చు
పేయములైన ♦ శుక పిక స్వనములు
ప్రకృతిదివ్య స్వభా ♦ వంబు దెలుపు
గీ॥ నంచుశృంగార కమలాల ♦ యంబులలరు
కామసంగ్రామసీమ యా ♦ రామసీమఁ
జేర మన్మనో వేదనో ♦ త్సేకమిట్టు
లినుమడించుటదేలకో ? యెఱుఁగనైతి ॥

ఇదిగో ! చతురోపాయధుర్రీణయగు మాచతురిక దీనికిఁ దగు సమాధానంబుఁ జెప్పఁగలదు(అని నగుమొగంబునఁ గూర్చుండును.)

[ చతురిక పరిశీలించుచు మోహినివంకఁజూచి ]

**చతురిక** — తే॥ గీ॥ రాత్రివేళను జింతాబ్ధ ♦ రపుముకుళితఁ
బూవు మిత్రోదయమునఁ బ్ర ♦ ఫుల్లమైన
సారసంబట్లు నేఁడుమా ♦ జలజవదన
ముల్లమదియేలయొక్కొ? ప్ర ♦ ఫుల్లమయ్యె॥

నెచ్చెలీ! నేఁడు నీముఖంబు నొక నూతనవికాసముపొడసూపుచున్నయది. కతమేమైయుండఁబోవు?

**మోహిని** — (తనలో) హా! నామనోవికారంబులెంతమఱుంగుఁజేసినను మాచతురికకు దురవగాహంబులుగావయ్యె. (ప్రకాశముగా) చతురికా! నాముఖంబున నున్న నూతనవికాసంబును నీవెట్లుగుర్తించితివి?

**చతు** — చెలీ! పల్కులచే భావప్రకటనంబుసేయఁ బలుమత్రియంబు తెచ్చుటరాఁదనో యని శంకించి నోరు మూకత్వమువహించినను నీయంతర్గతభావంబులెక్కడ బయటఁబడునో యని నీ భ్రమరాలకంబులెంతకప్పిపుచ్చఁజూచినను నీవదనారవిందము దెల్లమొనర్పక మానదయ్యె.

తే॥ గీ॥ అమలగంభీరగోష్ఠి! ప ♦ ద్మాయతాక్షి!
మంత్రనానికి దాఁచువే ♦ మర్మములను
చెలియ! దాఁచిపెట్టిననేమి ♦ తెలియకున్న
మనసునకు దర్పణము ముఖ ♦ మండలంబు॥

కావున నీవికసితముఖంబె సర్వముం జెప్పకచెప్పుచున్నది.

**మోహిని** — చెలీ! చతురికా! నీసామర్థ్యమేమో తెలిసికొనెదఁగాని నాముఖంబేమిచెప్పుచున్నదో తెలియఁజేయుము.

**చతురిక** — వయస్యా! నీవు కుపితమానసురాలవు గాకుందువేని పూసగుచ్చినట్లు వచించెద.

**మోహిని** — చెలీ! నిజమాడినఁ గోపమొందుదునా?

చతురిక — నిజమాడిననేరదా నిష్ఠురము.
మోహిని — నీకట్టిసందేహము వలదు. మనస్ఫూర్తిగా వచించెద. భయమువక్కి తెలియఁజేయుము.
చతు— ఉ॥ ఎవ్వని సత్పరాక్రమము ♦ నెవ్వనిరూపకళాకలాపమిం
కెవ్వని యావనోత్కరము ♦ నెవ్వనివ్యాప్త యశః ప్రపూర్తి ని
న్నవ్వీభులూరఁగా సలిపె ♦ నో యలధీరుని రాకవిన్కచే
జవ్వని ! హర్షవారినిధి ♦ సంచలనం బొనరించెడిన్సదా ॥
మోహిని — (తనలో) అతినిగూఢంబులగు మన్మనోభావంబు లీచెలి కగోచరంబులనకొంటినిగాని దీనికిసర్వంబు దృశ్యంబు. సర్వజ్ఞులగు వారిముందు మర్మాలాపంబు లపాయకరంబులు. కావున నాచెలివచనంబు లంగీకరంపక తప్పదు. (ప్రకాశముగా) చెలి ! నీవ క్యంబులు నిక్కంబులు. వ్రీడాభరంబున నింతద నుక వామోడిచెప్పనైతి ఎఱింగినదానిని మఱుంగు సేయ నేల ? వినుము. మత్కరగ్రహణార్థ మరుగుదెంచిన నృపకోటుల నెందఱినో తృణీకరించి వీరసింహునే నామనోనాథునిగ మనం బున నెలకొల్పి యుంటిననుసంగతి నీవెఱుంగుదువు నేఁటిద నుక నామహావీరాగ్రేసరుని ప్రత్యక్షమునఁగాంచు భాగ్యము లభింపదయ్యె కాని వందిమాగధజనంబులచే నందందు వాని దోర్బలసుగుణ సౌందర్యాతిశయస్తవంబులు శ్రవణానందము సంగి మన్మనోరథంబును దృఢంబుఁజేసినవి. కాని ధీరస్వాం తుఁడైన యావీరసింహుఁడు వైరినరనాయకుం డగుటంజేసి మజ్జనకుఁ డందుల కంగీకరించునో లేదోయనుశంక నామనం బునఁ బాదుకొన్నది. ఇపుడాతఁడు నాతండ్రిచే సన్మానితుం డగుటంజేసి నామనోభీష్టము నెఱవేఱవచ్చునని హర్షాయత్త చిత్తనై యుంటిని.
చతురిక — అయిన ! నన్నీయుద్యానవనమునకు రాఁబనిచిన పని యేమి ?

మోహిని — నామనోభావము నీకు వెల్లడిసేయుటకే

చతురిక — అటులైనఁ జల్లకువచ్చి ముంతదాఁచెద వేల ?

మోహిని — కృతార్థురాల నగుదునో లేదో యను తలంపున. ఏలయన ?

కం॥ అడుగండుత్తముఁ డితరుల
నడిగిన సంకల్పసిద్ధి ♦ వందఁగవలయున్
విడుచును బ్రాణము లేనియు
నడిగి కృతార్థుండుగాని ♦ యపుడు ధరిత్రిన్ ॥

చతురిక — చెలీ ! నవమాసంబులు మోసిన కన్నతల్లియేని యడుగక సాలీయదు. ఇఁకఁబరులా ! నిరర్థులఁ గృతార్థులఁ జేయుట.

మోహిని — ఇదిగో ! అడిగితినిగదా ! ఇఁకనన్నెట్లు కృతార్థురాలినిగాఁ జేసెదవో చూచెద

చతురిక — ఏమడిగితివి ?

మోహిని — చతురికా ! యేలనన్నిట్లు సిగ్గుమాలిన దానినిగాఁ జేయఁజూచెదవు.

చతురిక — అట్లొనర్చుట నావల్లఁగాదు. దానికి వీరసింహుఁడే తగియుండవచ్చును.

మోహిని — చెలీ ! నీపరిహాసోక్తులు చాలింపవుగదా ?

( తెరలో వైతాళికుఁడు )

సీ॥ సంజకెంజాయ లా ♦ శాచక్రములఁబ్రాఁకె
రవిబింబ మపర హా ♦ రాశిఁగ్రుంకె
ద్విజలోకమెల్లను ♦ విశ్రాంతిగొన సిమూ
హములుగాఁ దమకులా ♦ యములఁజేరె
చోరసంతతిమనో ♦ కూరత్వమునుదెల్పఁ
గడలెల్లఁగాఱు చీఁ ♦ కట్లుగ్రమ్మె

సుద్యాన వనవిహా ♦ రోత్సవసమయంబు
మెల్లమెల్ల నతికరి ♦ మించుచుండె
గీ॥ కుముదహితురాకఁ గోరుచ ♦ కోరములటు
తల్లిదండ్రులు నీదివ్య ♦ దర్శనంబుఁ
జేయవాంఛించుచుండ్రి వేం ♦ చేయుమమ్మ !
సత్వరంబుగఁ బూర్ణిమా ♦ చంద్రవదన ॥

మోహిని — చెలీ ! వైతాళికుని వాక్యములు వింటివిగదా ! ఇఁకఁ గాలయాపనమొనర్ప భావ్యముగాదు.

చతురిక — అవు నటులనే పోవుదము. కాని నీవీరాత్రి యొక కార్యమును నెఱవేర్పవలసియున్నది.

మోహిని — ఏమికార్యము ?

చతురిక — వీరసింహుఁడు వసంతమందిరమ్మున నేఁటిరాత్రివిశ్రమించునని తెలిసికొంటిని. మన మతిరహస్యముగ వానిశయనాగారమునుజేరి నీయభీష్టముల నాతని కెఱింగించి ప్రార్థింతము. ఉదారమానసులెప్పుడు నర్థిజనమనోవాంఛాసంసిద్ధికై కంకణంబు కట్టుకొనెదరు. గావున నీకోర్కె తప్పక నెఱవేఱితీఱును.

మోహిని — వలపు సిగ్గెఱుంగదన్నట్లొకవేళఁ బోయినను

చం॥ చెలియరొ! పూరుషుల్ కడు వి♦చిత్రగతిఁజరియించుచుండ్రితా
ర్వలసినవారలేని పద ♦ పద్మములన్ భజియించి భక్తిమైఁ
దలనిడుకొందురి గాని మము ♦ తన్ వలకాఁకల కోర్వలేమిచేఁ
బొలఁతి తనంతఁ దానడుగఁ ♦ బోయినఁ జుల్కనఁబల్కరింపఁడే॥

చతు — చెలియా ! అట్లనవలదు ! ఏలయన

మ॥ విలస న్మోహనమంత్రి పేటికలు త ♦ న్నీభోగ సామ్రాజ్యపుం
గలశంబుల్ సుకళా నిధానములు వి ♦ ఖ్యాతస్తన ద్వంద్వముల్
కలికీ వాని వశీకృతుం డలుపు ని♦క్కం బట్లుకాదేని తాఁ
బలుకన్నేర్చునె యన్యథా ! నిశిత దృ ♦ గ్బాణప్రసారంబులన్ ॥

కావున నో చెలీ! సమ్మోహనాస్త్ర తుల్యంబులగు నీదృగ్జాలంబులు ప్రసరించినంతనే యెట్టి ధీరస్వాంతులేని మోహపాశబద్ధులు గావలసినదే. కావున మన మిఁకఁ గాలయాపన మొనర్పక వేగమే పోవుదము.

మోహి — అయినఁ దిరిగి న న్నెక్కడఁ గలిసికొనుమనియెదవు ?

చతు — నీ జనని కేదేని మిషఁ జెప్పి యిక్కడికే రమ్ము. నీవు మగుడి వచ్చునందాక నిందేయుండి మన కార్యమనుకూలింపఁ దగిన యేర్పాటులఁ జేయుచుండెదను.

మోహి — మంచిదటులైన నేఁబోయి వచ్చెదను. (నిష్క్రమించును)

చతు — (తనలో) సిగ్గుచే నాచెలి తనమనోరథంబు నింతవఱకుఁ బ్రకటింపశంకించినను బ్రాణసఖినగుటచే నాపె మనోవృత్తి నెఱింగి శక్తివంచన లేక ప్రయత్నించుచుంటిని. దైవానుకూలంబున నాపన్నుగడలెల్ల సాగివచ్చినవి. ఇఁక ముందు జరుగనున్న కార్యమే యుత్కృష్టమైనది. ఇంతదాఁక నను కూలపడిన దైవము నేఁడేల కాకమానును. కాన నాతనినే నమ్మి నాచెలి కార్యమునకై కడంగెదను. (దిక్కులు పరికించి) అదిగో! సేవకుఁడెవ్వఁడో వచ్చుచున్నాఁడు. వానిచే వీరసింహుని యుదంతము నెఱింగెదనుగాక!

[సేవకుఁడు ప్రవేశించును.]

చతు — సేవకా! వసంతమందిర వార్త లేమి ?

సేవ — ఆంధ్రరాష్ట్రంబునుండి వీరసింహమహారాజుగారచట వచ్చి మనవసంతమందిరమందు దిగినారు.

చతు — ఆతనితో నింకనెవరున్నారు ?

సేవ — మన పరిజనులుదప్ప నింకెవరును లేరు.

చతు — మనరాజుగారు లేరా ?

సేవ — మనరాజుగారింతవఱకు నక్కడనేయుండి యాతనితో విందారగించి తమ మందిరమునకుఁ బోవనున్నారు.

చతు — నీకాతనిదర్శనము గల్గినదా ?

సేవ — ఆతనికిందగు పరిచర్యలొనర్చుచు నేనక్కడనేయుంటినిగదా?

చతు — అట్లైన నాతఁడెట్టివాఁడో గుర్తింపఁగల్గితివా ?

సేవ — ఇంతస్వల్పకాలములో నాతని మనోవృత్తి మెట్లెఱుంగఁ గలను. కాని యొకవిశేషాంశమును మాత్రము పొడఁగట్టితిని.

చతు — అదేమి ?

సేవ — తమయాజ్ఞచే వసంతమందిరంబులోఁ గట్టఁబడిన జగన్మోహినీ కుమారిగారి చిత్రఫలకంబుపైఁ దదేకదృష్టితో దృక్కులు నిగిడించినప్పటినుండి ముఖవికాసమునందుఁ గొంచెము మార్పుఁ బరిశీలించితిని.

చతు — ( తలపంకించి ) మంచిది ! నీవిపుడొక్క కార్యమును జేయవలసియున్నది.

సేవ — మీయాజ్ఞ కెదురాడుదునా ?

చతురిక — నేనీరాత్రి యాతనిరహస్యముగా దర్శింపవలయును. కావునఁ గావలివారల కీపారితోషికమొసంగి ద్వారములం దెఱచియుంచునట్లును, నారహస్యాగమనము బయల్పడకుండునట్లు కట్టుదిట్టములు సేయుము వేగమే పొమ్ము. (మెడలోనిహారమునొకదాని నిచ్చును)

సేవ — చిత్తమట్లే చేసెదను. (అని సంతోషమున వెడలిపోవును)

[ జగన్మోహినీ ప్రవేశము. ]

చతురిక — అదిగో ! మాజగన్మోహిని వచ్చుచున్నది. ఎదురేగి కలిసికొనెద ( ముందునకుఁబోయి ) నెచ్చెలీ ! ఏమింతాలస్యముఁ జేసితివి, విశేషము లేమి ?

మోహిని — నాయనగారు వసంతమందిరమునుండి యిప్పుడే వచ్చినారు. వారు విశ్రమించుదనక వేచి మాతల్లికెద్దియో మిషఁ జెప్పి యెవరుచూచిపోవుదురోయను భయంబున ముసుంగిడుకొని ప్రాణంబుల బిగఁబట్టుకొని వచ్చితిని.

చతురిక — సుందరిడి ! ఇంక వసంతమందిరములోనికిఁ బోవుదమా ?

మోహిని — కావలివారలు మసల గుర్తింతురేమోకదా ?

చతురిక — భయక్షేమియును లేదు దానికిం దగిన యేర్పాటులఁ జేసితిని.

మోహిని — అటులైనచోఁ బోవుదము. పదము (ముందునకు నడచి) ఆదీపమున్న దే కదా వసంతమందిరంబు.

చతురిక — అవును. ద్వారములు దెఱచియేయున్నవి. వేగముగా రమ్ము (అని లోనికిఁబోవుట నభినయించి యాశ్చర్యమున నిల్చెదరు. చతురిక దిక్కులుపరికించి) నెచ్చెలీ ! అక్కడ నెవరో తిరుగాడుచున్నట్లున్నది. పోయి కనుఁగొనివచ్చెదనుగాని నీవు లోనికిఁబోయి నిలిచియుండుము. (వెడలును)

[ వీరసింహుఁడు నిద్రించుచుండును ]

మోహిని — (ఆశ్చర్యమునఁ దనలో) నేఁటికిఁగదా ! యీ మహాతేజశ్శాలిఁ గాంచుభాగ్యము లభించినది.

ఉ॥ చుక్కలఱేఁడొకో ! కలువ ♦ సూడొకో ! యిందుభిడో ! లే
[ కుపేందుభిడో !

జక్కులవేలుపో ! నవవ ♦ సంతుఁడో ! దేహముగోలుపోని యా
చక్కెరవింటివాఁడొ ! రతి ♦ శాస్త్రసముద్ర సుధాకరుండొకో !
యెక్కడిసోయగంబు వరి ♦ యింపరొకో ! సురకాంత లేనియున్॥

అవురా ! నేవిన్నవర్ణనవీని నిజరూపమున నష్టాంశమైన లేదే ?

ఉ॥ వాలుకనుంగవల్ పెదవి ♦ పైఁ జరియించెడి లేఁతనవ్వులున్
బాలమెఱుంగు లీనుముఖ ♦ పద్మమునందలి కోరమీసముల్
బాళిని గల్గఁజేసె మరు ♦ బారికి మేను కృశింపఁజేసె నా
పాలిటి దైవతంబగు కృ ♦ పామతిఁ గన్నుల విప్పిచూడఁడే॥

అదిగో ! నామనోవల్లభుండు గదులుచున్నట్లున్నది. కావున నేనీ కాండపటంబున కీవల నుండియే వాని తనూవిలాసంబుల నేత్రో

త్సవంబుఁ గావించుకొనెద. (అని కాండపటంబున కీవలనుండి తొంగి చూచుచుండును — చతురిక ప్రవేశించి)

చతురిక — మోహినీ! స్వయముగా మాట్లాడవచ్చిన నీకీ ప్రక్కచూపులేల? లోనికినడువుము.

మోహిని — ఆగుమాగుము! ఆతఁడెద్దియో మాట్లాడుకొనుచు న్నాఁడు. విందము.

చతురిక — అటులనా? (అని యిరువురును వినుటనభినయింతురు)

వీరసింహ — (అదిరిపడి లేచి కన్నులునలుపుకొనుచు దిక్కులు పరికించి) ఏమిది! కలయా నిక్కమా! పరపురుషనివా సితంబగు రాజహర్మ్యంబున కొకస్త్రీ రాఁబనియేమి? నిక్క ముగా నిది కలయై యుండనోపు. ఆహా! దీనిఫలితార్థ మెట్లుండునో!

చ॥ ఒకకలఁగంటిఁ గంటిని ప♦యోరుహనేత్ర! సువర్ణగాత్ర! బి
నకుచ! బికస్వన! సుగద♦నన్! సుగళన్! మృగరాజమధ్య! న
త్యకలుషచిత్త! నీలకుటి♦లాలక! గంధగజేంద్రగామినిన్!
ముకురసమాస్యయైన పువు♦బోణిని! వాణినిమించుమానినిన్!॥

లోకంబున నిట్టిసుందరు లుందురా!

తే॥ రక్తమాంసాస్థి కృతశరీ♦రంబుఁదాల్చు
నరసతులకెందు నిట్టిసౌం♦దర్యముండు?
నమలసౌందర్యనిధి కుదా♦హరణముగను
బ్రహ్మ సృజియించియుండు ని♦వ్వాలుఁగంటి॥

ఒకవేళనుండినచో సఖండిదోర్దండ పరాక్రమోద్దండ వైరి నరభయంకరుండును. ఫాలానలజ్వాలా దందహ్యమానాంగ త్రణీ కృత మోహనాంగుండునగు వీరసింహుని కర్ధాంగి కాఁజాలక మఱె వ్వరిచెట్టఁబట్టఁగలదు? అట్టిమోహనాంగి కరగ్రహణంబొనర్పమన్న నాపప్రముఖశ్వమేమి?

ఉ॥ వానిది స్వర్గరాజ్య పరి ♦ పాలన వాఁడె శచీధవుండు న
వ్వానియశస్సె సుస్థిరము ♦ వానిరసజ్ఞతకే ఫలంబు న
వ్వానివె భాగ్యభోగ్యములు ♦ వానిదె సార్థకమైనజన్మ మె
వ్వానిని జెట్టఁబట్టు నిటు ♦ వంటి తలోదరి సుప్రసిద్ధిగన్ ॥

మోహి — చతురికా! మనలనాతఁడు చూచెనాయేమి?

చతు — లేదులేదు! కలలోఁ గాంచిన నీరూపమునకే యింత తపించుచున్నాఁడు. ఇఁకఁ బ్రత్యక్షురాలవై తివేని మూర్ఛాపరవశుండగు చేమోకదా!

మోహి — చతురికా! ముందునకుఁబోవుట కిదియే తగినసమయమని తోఁచుచున్నది. పొమ్ము పొమ్ము.

చతు — మోహినీ! యేలనీకింత వేగిరపాటు? నీమనోధవుండు మనోభవానల దగ్ధుండగుననియా? మ తేమియుభయము లేదు. కొంచెమోపికపట్టుము. సర్వమును విశదమగును. అదిగో! యింక నేదియోచెప్పఁబోవుచున్నాఁడు నిశ్శబ్దముగానుండుము.

వీర — ఆహాహా! అప్రతిమానమైన యారూపము మఱవఁదలంచినను మఱపునకు రాకున్నది. కన్నులఁగట్టినట్లు ప్రతిబింబించుచున్నది. దీనిగాంచువిధమెద్ది?

సీ॥ శ్రీకారములఁబోలు ♦ చెలియ వీనులజంట
కలికి సౌభాగ్యంపు ♦ గరిమఁదెల్పు
విద్యుల్లతాదీప్తి ♦ విస్ఫురత్తనురుచుల్
చెలువ లావణ్యాంపుఁ ♦ జెలువుఁదెల్పు
నుత్తుంగకుచనితం ♦ బోద్ధతిఁబరికింప
మదనుసామ్రాజ్య మ ♦ ర్మంబుఁదెల్పు
చకితారుణాబ్జలో ♦ చనమోహనుత్తమ
జాతి కన్యకయున్న ♦ రీతిఁదెల్పు
గీ॥ వదనవిచులత హృదయ భా ♦ వంబుఁదెల్పు
నిట్టిసుందరరూపమిం ♦ దేదికలదె?

యవనిఁగలదేని దానిఁబెం ♦ డ్లాడకున్నఁ
బ్రాణమేల ? బాహుబలసం ♦ పదలవేల ? ॥

ఆహా ! సాంద్రములై నిడుదలై నీలాంగుళీయకములై యల రారుచున్న యాపెకుటిలాలకంబు లెంత మనోమర్మ విభేదకంబులుగా నున్నవి. (ఆలకించి) ఛీ ! అంగనలకై పరితపించుట వెంగలికిందగుఁగాక ! అంతియేకాక యిది కలయూయె.

మ॥ కలలోఁగాంచినదానికై యిటులఁ జీ ♦ కాకైనచిత్తంబునన్
విలపింపన్ దగు మూఢమానసులకున్ ♦ విజ్ఞానులైనట్టి వా
రలకున్ సంతసమబ్బఁ జేయునొకో ? ధీ ♦ రన్వాంతులిట్లైనఁ దాఁ
గలలోఁగాంచిన భాగ్యసంచయము ని ♦ క్కంబౌనె జాగ్రత్తునన్॥

కావునఁ గన్నులుమూసికొని పరుండెదఁగాక (పరుండును) చెలియా ! యేల మాటిమాటికిట్లు నాకనుదమ్ముల కడ్డము వచ్చెదవు ?

మోహి — చతురికా ! మనమాతని కంటఁబడ లేదుకదా !

చతు — లేదు ! లేదు ! ఊరకుండుము.

వీర — అవురా ! నాలోహనిర్మిత నారాచంబులకన్న నీకుసుమాస్త్రంబులెంత తీవ్రముగానున్నవి.

ఉ॥ ఇంతటిదాఁక లోకముల ♦ నెల్లజయించిన వాఁడనంచు న
శ్రాంత నితాంతగర్వమునే ♦ సంచరణంబొనరింతుఁగాని బల్
వింతగఁదోఁచెనేఁడు విరి ♦ విల్లుధరించిన వానిముందు నా
పంతము సుంతయూ కతన ♦ వానికి బానిసనైతి నిస్సిరో ॥

కానిమ్ము ! కలలోఁగాంచిన యీమృగాక్షి నిక్కంబుగా జగంబునందుండెనేని బాహుపరాక్రమంబుననేమి మఱేవిధంబుననేమి దానిఁబాణిగ్రహణమొనర్చి కొనవలయును. ఆదివ్యవిగ్రహరాలినిగాంచు భాగ్యమునాకు లభించునో లేదో.

చతు — (మెల్లఁగా) చెలికా! నీయందింత బద్ధానురాగుఁడై యున్న వాని నుపేక్ష సేయు టనుచితంబు గావున నిట్టిసమయం బుననే నీదర్శనభాగ్యమాతనికిచ్చి యాతనినానందింపఁ జేయ వలయును. రమ్ము (అని ముందునకువత్తురు) వీరాగ్రణీ! అప్రియత్నముననే ప్రత్యక్షంబుగానున్న దానికై విశ్వప్రియ త్నమేల ?

ఉ॥ ఇంతటిదాఁక మేము భవ ♦ దిష్టమెనో తెలియంగఁగోరి యీ ప్రాంతమునందుదాఁగి వల ♦ వంతలఁజెంతిలఁజేసినట్టి మా యింతి! సుదంతి! మన్మథునిఁయింతి! పొలంతులమేలుబంతి! య శాంతదిగంతకీర్తి కప ♦ చారమొనర్చిన దీనిసైఁపుమా॥

వీర — (తనలో నాశ్చర్యమున) ఇదియే నాస్వప్నలబ్ధార్థంబు.

కం॥ కలలోఁగాంచిన భాగ్యమె
వలవంతలఁగూర్చినట్టి ♦ వనితామణియే
కలకాదిది సత్యంబని
కలరూపముతోడ వచ్చెఁ ♦ గామితఫలమై ॥

స్వప్నదృష్టంబైన యాకారంబునకే యింత తహతహపడు చుండఁ బ్రత్యక్ష సందర్శనానంతరంబున నామనం బెట్లుండవలయు నో యట్లున్నది. అయిన నాసుందరులనిట్లు పల్కరించిచూచెదఁ గాక. (ప్రకాశముగా)

ఉ॥ ఎవ్వతలీరు? నామముల ♦ వెయ్యవి? యొంటరి నర్థరాత్రినం దివ్విధిరాఁగనేల? యొవ ♦ రేనియు మీకపకారముూనిరే? యెవ్వరు తల్లిదండ్రులు శు ♦ భేక్షణ లేరికిఁ బ్రాణకాంతలో జవ్వనులార! తెల్పుఁడి లసత్సుధలొల్కెడి ముద్దుపల్కులన్॥

చతు — ఆర్యా! యీపెకళింగ పురవరాధీశుని తనయ. జగన్మో హిని నాఁబరంగునది. పరపురుష నిర్గమ్య రమ్య హర్మ్యతలాం తఃపురంబులవీడి యన్యప్రదేశములఁజొచ్చి యెఱుంగనిది. తత్ర నూవిలాసంబులు నీనేత్రాంబుజములకుఁ దప్ప నొరులకుఁ

జూపనిది. ఆమె కోకిల కంఠస్వనంబుల నానందించుభాగ్యము నీశ్రవణంబులకే కల్గనున్నది. తత్కరగ్రహణార్థ మరుదెంచిన నృపకోటులనెల్లఁ దృణీకరించి దిగంతవ్యాప్తమైన నీకీర్తియు బాహుబల పరాక్రమంబులను సుగుణసౌందర్యాతిశయంబులను విఖ్యాతచర్యలను మున్ననేకపర్యాయములు వినియుంటచే నిన్నే తనమనోనాథునిగఁ దలపోసినది. కాని వైరిపక్షావలంబివగు టచేఁ దన్మనోరథసిద్ధి కల్గునో కలుగదో యను శంకచేఁ జింతానంకులిత మానసయై యుండెను. మాయదృష్టంబున నేటికి మావీటికి విచ్చేసితివి. మాసేని కాపుఁడవైతివి. కావున మాచెలిమనంబు మీకెఱుంగఁజేసి కృతార్థతఁబడయ వచ్చితిమి. మాసాహసంబున కన్యథా తలంపక క్షమింప వలయును.

వీర — చెలియలారా! మీకట్టిమనోభీష్ట ముండుట యుచితమే. కాని యుక్తాయుక్తతలు పాటింపవలదా?

చతురిక — యుక్తాయుక్తతలు యోజింపక మేమొనర్చినదేమి?

వీర — ఏమియా! వినుఁడు.

సీ॥ రణరంగసీమ లా ♦ రామసీమలుమాకుఁ
జెండాడుటలెమాకుఁ ♦ జెండ్లయాట
రణనీతులేమాకు ♦ రతికళాభ్యాసముల్
జ్యాఘోషలెన్న మ ♦ త్తాళిరుతము
దేశభక్తియెమాకు ♦ దివ్యకామాసక్తి
యరిభంజనంబె కా ♦ మాహవంబు
సద్యశోజయమలే ♦ సంసారసంతతుల్
భీభత్సరసమె యా ♦ ప్సితరసంబు

గీ॥ అట్టి రణకర్కశులదేడ! ♦ యబలలేడ
సహజవైరంబుగల్గు త ♦ త్సఖ్యమెట్లు

చిరతరామోద మొసఁగునో ♦ చెలియలార!
చింత సేయక యిట్టులా ♦ సింపఁదగునె? ॥

చతురిక — పురుషసింహా! రాజులెల్ల శస్త్రజీవులే కదా! వారు యుద్ధము లొనర్చి దారపుత్రులతో సంసారమొనర్చుట లేదా? సమరతలంబులందున్నయెడ స్త్రీల తగులంబుల నిషేధించిన నిషేధించియుందురుగాక. సర్వకాలంబుల భిక్షువులవలె నుండుమని కాదు. కావున మమ్ము నిరాకరింపక మా ప్రార్థన నంగీకరింపుము. మఱియు.

సీ॥ మనసువచ్చినవాఁడవు ♦ మనుజపతివి
సుగుణసౌందర్య ఖనివహో! ♦ శూరమణివి
చెలియ వలకాఁకఁదేర్ప నీ ♦ వలవఁగాక
సాధ్యమెవ్వారికింకనో ♦ సాహసాంక! ॥

రాజా! యింతయేల వినుము. మాచెలి కృతార్థురాలు కాదేని విషమాని ప్రాణంబులఁబాయ సంసిద్ధురాలై యున్నది. ఏలయన స్త్రీలకు మానమే పరమ ధనంబు. అట్టి మానమును గోల్పోయినవారి జీవంబులు నిరర్థకంబులు. మనసార వరించినభర్త తన్ను నిరాకరించినచో మరణంబుకన్న వారికి వేఱుశరణ్యంబు లేదు. కాన మాచెలి ప్రాణంబులు నీకృప ననుసరించియున్నవి.

వీర — చెలియలారా! మీ రెంతయును సమర్థలే. ఈయల్పకార్యంబునకేల యింతటిసాహసకృత్యము. మీచెలి దివ్యమోహనాకార సందర్శనంబున మోహపాశబద్ధుండుగాని మానవుఁడుండనేరఁడు. సంగపరిత్యాగులైన మునిపుంగవులు సైతమాపెకు దాసానుదాసులు గావలసియుండఁగా నిఁక నాబోఁటి మానిసులా? మీవాంఛితంబున కేను సమ్మతించితిని. కాని యొక కార్యమునకై వచ్చి రాజసన్మానంబులంది వానికి విందనై తుదకు వాని యంతఃపురకన్యకలను రహస్యంబునఁ గైకొంటకన్న వానియాజ్ఞానుసారమున నాపెఁబరిణయమాడుట శ్రేయస్కరంబు.

చతురిక — ఆర్యా! మాకును నదియే సమ్మతము.

వీర — సుందరులారా! తెల్లవాఱుచున్నది. మీరు శీఘ్రంబున మీతావున కరుగుఁడు. వేఁకువనే మీతండ్రి యిటకరుదెంతు నని చెప్పియుండె. కానవాఁడీక గావచ్చును. పరపురుష గృహంబునందంతఃపురస్త్రీలుండుట సంశయకారణంబు. నే నేవిధంబుననైన నామోహనాంగిని బరిణయమాడువాఁడ. కావున శంకదక్కి మీనిలయంబుల కరుగుఁడు.

చతురిక — మాప్రార్థనను మఱవవలదు.

వీర — ఆభాగ్యము నాకునుగలదుగదా? మీరింతగాఁ జెప్పనేల?

చతురిక — మేము పోయివచ్చెదము. (అనికొంచెము ముందునకుఁబోవ)

జగ — నెచ్చెలీ! యీవసంతమందిర మెంతరమణీయముగా శృంగారించిరి. (అని వెనుదిరిగి చూచుచు బోవును)

వీర — పాపమా ముద్దుగుమ్మ నన్నుబాయఁజాలక వసంతమందిరపునపంబున వెనుకవెనుకఁజూచుచుఁ బోవుచున్నది. హృదయపుట భేదకంబులగు నాచూపు లెంత సునిశితంబులు!

తే॥ అబల ననుబాసిపోవఁగా ♦ క్లాడకుంట
నెపముగల్పించి వెన్కకు ♦ ద్దిరిగిచూచుఁ
గలికిచూపులు విరివింటి ♦ ములుకులగుచు
హృదయపుటమును భేదింప ♦ మొదలువెట్టె ॥

(తిరిగి పరుండి తనలో) ఆహా! సిరిరామోకాలొడ్డినట్లు తనకుఁ దావలచివచ్చిన యీస్మరసామ్రాజ్యలక్ష్మి నేల పొమ్మంటిని. అన్యోన్యావలోకన క్రియలచేనైనఁ గొంతకాలయాపన మొనర్పనైతిని. ఛీ! యెంతమందభాగ్యుఁడను. (అని విస్మయచిత్తంబునఁ బరుండును.)

[ మాధవవర్మయు మంత్రియుఁ బ్రవేశింతురు ]

మాధవ — సచివాగ్రణీ! వీరసింహుఁ డెద్దియో కలవరించుచున్న ట్లున్నది.

మంత్రి — రాజా! కలవరింతగాదు, దేనివిషయమో యోజించుచున్నట్లున్నది.

మాధవ — అట్లైన నిక్కడనుండియే విందము. ఆగుము.

( వినుట నభినయింతురు. )

వీర — ఉ॥ ఎప్పుడు తెల్లవాఱునిఁక ♦ నెప్పుడు ఱేఁడిటవచ్చు, వచ్చితా
నెప్పుడు నాయుదంతము గ్రహించి కరగ్రహణంబు సేయఁగా
నొప్పు నిఁ కెన్నఁడావికసి ♦ తోత్పలనేత్రివచస్సుధాంబుధిన్
దెప్పఁగఁ దేలియాడెదు న ♦ దృష్టము గల్గఁగఁజేయుదో కదా ॥

మాధవ — మంత్రీ! యీతఁ డెవతెనో మోహించియున్నట్లున్నది. ఆతని నిటుఁ బల్కరించిచూచెదఁగాక! వీరసింహా! నారాజ్యమందేపయోరుహాక్షి వచస్సుధాంబుధిని దేలియాడనుంటివి?

వీర — ( ఆశ్చర్యమున ) రాజా! నీవిటకరుదెంచి యెంతకాలమైనది?

మాధవ — ఇప్పుడేవచ్చితిని! ఎద్దియో కలవరించు చున్నట్లున్నదే?

వీర — కలవరింతగాదు. నేఁడు నీచే నొకకార్యము గావలసియున్నది. దానిని నెఱవేర్తువా లేదాయని యోజించుచుంటిని.

మాధ — వీరసింహా!

తే॥ తివిరి నీయంతవాఁడు పా ♦ ర్థించినంత
దానినావంటివాఁడు చేఁ ♦ బూనకుంట
జగము నందున్నె? నీవు సం ♦ శయము వలదు
చెప్పుమా దానిదీర్తు నా ♦ జీవమాన ॥

వీర — అట్లయినచో వినుము.

మ॥ అతి మాధుర్య సువాఙ్నిరూఢను జల ♦ చ్ఛాయామాలక [ప్రాభవన్
శతపత్త్రేక్షణఁ జారుగాత్రి ముకురా ♦ స్యన్ బక్వ బింబాధరన్
దతచాంపేయసునాసికన్ దవసుతన్ ♦ దన్విన్ జగన్మోహినిన్
సతిఁగాఁ జేసికొనందలంతు మదభీ ♦ ష్టంబిద్ది యీడేర్పుమా॥

మాధ — ధీరోత్తంసమా! నీయంతవాఁడు నాకల్లుఁడైన నింకేమి కొదవ. అదియే నాకు మహానందము. నాగారాబుపట్టియును నీయందే బద్ధానురాగయై యున్నట్లు తెలిసికొంటిని. కానినా మనంబున నొక శంక కద్దు. దానికై వెనుకాడుచున్నాఁడను.

వీర — రాజా దాని నిస్సంశయముగాఁ దెల్పుము.

మాధ — వీరసింహా! వినుము.

ఉ॥ కొడుకులు లేరటంచు మదిఁ ♦ గుందుచునుండిన నాకు నేఁటికి
పడుచు జనించుటన్ విపుల ♦ భాగ్యము లబ్బినరీతిఁగాఁ గడుం
గడుముదమంది గారవము ♦ నన్ గని పెంచితిఁగాన దీనినే
విడువఁగఁజాల నెల్లరకుఁ ♦ బ్రీతికదా యరుదైనవస్తువుల్॥

వీర — రాజా! లోకములో నీవొక్కఁడవే కాదుగదా కుమార్తెలఁగన్నవాఁడవు. వారందఱకిట్టి ప్రేమాతిశయంబులు లేవా? కూఁతుపైనున్న మమకారంబున నిట్లెంతకాలము వివాహముఁ జేయక యుంచుకొనెదవు? స్త్రీజన్మమెత్తినమీఁద వారుపరాధీనలే కదా?

మాధ — ఓయీ! నాతాత్పర్యమదిగాదు. నాయొక్క నియమానుబద్ధుండగు వానికీఁదలఁచితిని.

వీర — నీనియమమేమి?

మాధ — నాకుఁగుమారుఁడైనను గుమార్తెయైనను నీపెయే కావున నాప్రాణావసాన సమయమువఱకీ నాముద్దుకుమార్తెను నాయింటనే నిలుప నొప్పుకొనినచో నీయఁదలంచితిని.

**వీర** — ఇదిగో కదా నీ నియమము ! నేను దన్నియమమును బద్ధుండనై యుందు. ఇట్లు తప్పితినేని గురుచరణంబులఁ దప్పినవాఁడ నగుదును. ( అని చేతో యివేయును. )

**మాధ** — వీరసింహా ! కడు సంతసించితిని. నాముద్దుకూఁతును నీకీయ నిశ్చయించితిని ( మంత్రిని దిక్కై ) మంత్రీ ! జగన్మోహినిని కోడఁ గొనిరావలసినదిగాఁ జెప్పి పంపుము.

**మంత్రి** — చిత్తము. ( అని వెడలి మోహినిచెలికత్తెలతో వచ్చును )

**మాధ** — అమ్మా ! జగన్మోహినీ ! యిటు రమ్ము. ( అని చేరఁ దీసి ) తల్లీ ! యీతఁడు వీరసింహాంకుఁడు. శునకముంగు సోదరుఁడు. బాహుబలపరాక్రమంబుల జగంబునఁ బేరొన్నవాఁడు ఇతని ప్రఖ్యాతి నీవును నిదివఱకే విని యుందువని తలంచెద ( మోహిని సిగ్గు నభినయించును ) నిన్నాతని కర్ధాంగిగాఁ జేయ నిశ్చయించితిని.

మ॥ దళితారాతి కృపామయుండు తనుసౌం ♦ దర్యాద్వితీయుండు న
త్యలఘుస్ఫార ధనుర్ధరుండితని కీ ♦ వర్ధాంగివైయుండి స
త్కులజాతాంచిత శీలముల్పొగడ మా ♦ కుఁ నారికిఁ గూరుముల్
చెలఁగన్ జేసి పవిత్రవై గొనుము త ♦ ల్లీ ! యోజగన్మోహినీ ॥

వీరసింహా ! దగ్గఱకు రమ్ము ( అని మోహిని చేతిని వీరసింహుని చేతిలోనుంచి ) ఇదిగో ! మాజగన్మోహినిని నీకర్ధాంగిగా నొసంగుచున్నవాఁడ. ఇఁక వివాహక్రమంబునఁ బరిణయ మహోత్సవము గావింతము. రండు.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.

శ్రీ



# Veera Prathap.

# వీరప్రతాప్.

## తృతీయాంకము.

—• మాధవవర్మ దర్బారు. •—

[మాధవవర్మ మంత్రిసహితుఁడై కూర్చుండియుండును]

మాధ — మంత్రీ! వారము దినములైనను వివాహమహోత్సవమున నీమాటనే మఱచితిని. అశ్వమును గొనిపోయిన యాచోరులెవరంటివి ?

మంత్రి — కొండఱు మాగధేయులు

మాధ — వారెందుల కీగుఱ్ఱమును గొనిపోయిరి ?

మంత్రి — మగధపతియాజ్ఞచే వారట్లు చేసియుండవచ్చును. నిజమింకను దెలియలేదు. విచారణకై వారిని మనభటులు గొని వచ్చుచున్నారు.

మాధ — ఓహో! యిది వీరసింహుని కోపానలంబును వృద్ధిసేయునే? వారలకుందగు శిక్షనొనర్తము. ఈవార్త వీరసింహున కెఱింగించితివా ?

మంత్రి — లేదు. గుఱ్ఱమునుమాత్ర మతనికప్పగించితిని. అతఁడాగుఱ్ఱమును గాంచినంతనే యపరిమితానందమున దానిఁగౌఁగలించుకొని ముద్దాడెను. ఇప్పుడే యాతఁడును రావచ్చును.

[ సేవకుఁడు ప్రవేశించి ]

సేవ— అయ్యా! ద్వారంబున వీరసింహరాజుగారువచ్చియున్నారు.

మాధ — మంత్రీ! ఎదురేగి తోడ్కొనిరమ్ము.

[ మంత్రివెళ్లి వీరసింహునితో వచ్చును ]

మాధ — (లేచి) వీరసింహా! యీరత్నకీలితాసన మలంకరింపుము.

[ వీరసింహుఁడు గూర్చుండును ]

మాధ — శూరశిఖామణీ! నిర్హేతుకాపవాదంబు మాపై మోపితి వేకాని నిజము నేఁడైనఁ దెలసినదా? .

వీర — రాజా!

తే॥ పంచభద్రంబు కన్నిలఁ ♦ బడినయంతఁ
క్రోధమదియెల్ల మదిని ని ♦ ర్మూలమగుచుఁ
బరమసంతోషమునఁదేలు ♦ భాగ్యమొదవెఁ
. దప్పిదొరకినవస్తు వెం ♦ తటి ప్రియంబొ! ॥

మంత్రి — రాజా! అరుగో చోరులువచ్చిరి. వారిని విచారించి తగుశిక్ష యొనర్పవలయును.

మాధ — ఏరి! వారలనిటురప్పింపుము.

మంత్రి — భటులారా! ఆచోరుల నిటుతీసికొనిరండు.

( సంకెలలతోఁ జోరులను భటులు కొనివత్తురు )

మాధ — ఓరీ! మీరెవరు?

చోరులు — మేము మగధదేశీయులము.

మాధ — మీగ్రామమేది?

చోరులు — అయ్యా! చిరకాలమునుండి మీ రాజ్యమునందే వసించుచున్నారము.

మాధ — మీరీచోరవృత్తి నేలచొచ్చితిరి?

చోరు — అయ్యా! మేము చోరులము కాము. ధనాపేక్షచే నొక స్త్రీప్రోత్సాహమువల్ల నీపనికియ్యకొంటిమి,

మాధ — [ ఆశ్చర్యముస ] ఏమి ! స్త్రీ పోలికలా ! సహమా !
ఆ స్త్రీ యెవరు ?

చోర — ఆమె యీయుంతఃపురమునందే యున్నది.

మాధ — మంత్రీ ! ఏమి యీ యాశ్చర్యము ! ఆ స్త్రీ మనయంతఃపురంబుననే యున్నదట.

మంత్రి — ఓరీ ! మీ రామె పేరెఱుంగుదురా ?

చోర — అయ్యా ! మే మెఱుంగము.

మంత్రి — ఆమె మీకెట్లోడ నేమి చెప్పినది ?

చోర — అయ్యా ! కళింగపురమునకు సమీపమందున్న యరణ్యములో వీరసింహుఁడను పురుషుఁ డొకఁ డున్నాఁడనియు వాని గుఱ్ఱమును హరించి పట్టి తెచ్చితిరేని వేయిరూపాయ లిచ్చెద ననియు వాగ్దానముచేసెను. అందుల కనేక దినములనుండి ప్రయత్నముచేసి వారిమూఁడు దినంబులకిందట దానినిబట్టఁగల్గితిమి.

మంత్రి — మీ రా స్త్రీనిప్పుడు గుర్తింపఁగలరా ?

[ సేవకుఁడు ప్రవేశించి ]

సేవకుఁడు — దేవా ! అంతఃపురంబునుండి చతురిక వచ్చి తమయాజ్ఞకై వేచియున్నది.

మాధ — మంచిసమయమున వచ్చినది. లోనికిం గొనిరమ్ము.

[ చతురిక ప్రవేశించును ]

చతు — రాజా ! మీదాసురాలి విన్నపమొక్కటియున్నది. ఆగ్రహచిత్తులు గాకుందురేని విన్నవించుకొనియెద.

మాధ — చతురికా ! సందియమువలదు. చెప్పుము.

చోర — ( అందఱు ) బాబూ ! యీ పెయే ! యీపెయే ! !

చతు — దేవా ! నిరపరాధులగు వీరలనేల నిష్కారణముగా శిక్షించెదరు ? దీనికంతకును మూలకారకురాలనగు నన్నే శిక్షింపుఁడు. నాకుఁగాను వారలశిక్షించినచో నాపాతకంబు

నన్నుఁ బట్టుకొనలేదా? కావున వారల విడిచిపుచ్చి నన్ను శిక్షింపుఁడు.

మాధ — చతురికా! నీవె కారకురాలవైతివి? జరిగినదెల్ల నెఱింగింపుము.

చతు — మహాభాగా! మీ కుమార్తె యీవీరసింహుని బలరూప శౌర్యాతిశయంబుల విని వానియందు బద్ధానురాగయై వానినే తనమనోనాయకునిగా వరించి వానిసంగమమసంభవమగునేని ప్రాణములైన బాయుటకు సంసిద్ధురాలై యున్నది. ప్రాణసఖినగు నేనీకార్యము నెటుల సాధింపఁగల్గుదునా యనుకొనుచుండ వీరసింహుఁడు కల్యాణపురంబువీడి మనపురసమీపమునందున్న కాంతారమునందు వసించుచుండెనని వింటిని. వానినేవిధంబుగా మనపురంబునకు రప్పింపఁగల్గుదునాయని తలఁచి తలఁచి తుదకీ సాహసకార్యమునకుఁ గడంగి వీరలనామీదకుఁ బంపితిని. నేననుకొనినట్లు దైవవశంబున వీరసింహుఁడీ పురంబునకువచ్చి మనమోహనింగాంచి మోహించి పరిణయమాడె. నాప్రాణములనైన వెచ్చించి మాచెలికాతని పొందుఁగూర్ప వలెనని సంకల్పించుకొంటిని. అయ్యదినేఁటికి సిద్ధించెను. ఇంక నెట్టి శిక్షనైన నానందమున గ్రహించుదాన. మీవిధి ననుసరించి కార్యము నెఱవేర్పుఁడు.

మాధ — మంత్రీ! యీపెచరిత్ర మిగుల నాశ్చర్యముగానున్నది. ఏమిచేయుటకును దోఁపకున్నయది.

వీర — రాజా! ఈస్త్రీ నిక్కముగా మదీయరోషానల జ్వాలలకాహుతికావలసినదేకాని యీపెసాహసమతి ప్రశంసనీయము. చతురత్వముచేఁ దనచతురికా నామమును సార్థకపఱచుకొన్న జాణ. పరోపకారమునకై స్వార్థత్యాగమొనర్చినదిట్ట. ఈపె కృత్యములు గోపమునకుమాఱానందమును నాశ్చర్యమును గల్గించుచున్నవి. ఈపెనాయందెట్టి దురుద్దేశముతోడను జేయ

లేదు. నాకు దోషముగఁ దోఁచినకార్యమే తుదకు మేలుగాఁ బరిణమించినది. ఆపె శిక్షార్హురాలెంతమాత్రమును గాఁజాలదు. నిక్కముగా నాపెసన్మానార్హురాలు. కావున నీవెను జోరులను విడిచిపెట్టుటయే నాయభీష్టము.

మాధ — వీరసింహా! నీయభీష్టమే సర్వజనాభీష్టము. చతురికా! యికనీ వంతిపురంబునకుఁ బోవచ్చును. [చతురిక లోనికిఁ బోవును] ఓ మాగధేయులారా! వీరసింహునిచే మీరనుగ్రహింపఁబడితిరి. ఇఁకముందెన్నఁడు నిట్టికార్యములొనర్పక మీగృహంబులఁ కరుగుఁడు.

చోర — చిత్తము. బాబులార! మీదాసులము క్షమింపుఁడు. (నిష్క్రమింతురు)

మాధ — వీరసింహా! గతమును మఱచిపొమ్ము! నేఁడునిన్నొక కార్యమునకై పిలిపింపఁదలంచితిని.

వీర — నేనే వచ్చితినిగదా! కతిమెద్దియో తెల్పుము.

మాధ — అట్లయిన వినుము!

ఉ॥ పుత్త్రిలులేని భూపులకుఁ ♦ బుణ్యగతుల్ గడు దుర్లభంబు ల
ద్ధాత్రి యరాజకంబగుట ♦ తథ్యము గానఁ గళింగభూరమా
నేత్రుఁడవై యపత్యసుఖ ♦ నీరదముల్ గురిపింప నీవెమా
పుత్త్రుఁడవై వసింపుము ♦ భూనుతసాయక! యాంధ్రనాయకా॥

అనపత్యదోష చింతాస్వాంతుఁడనగు నా మానసంబున కాహ్లాదంబుఁగూర్ప నాపుత్త్రుఁడవై యీరాజ్యలక్ష్మిని గూడఁ జేపట్టి పట్టభద్రుఁడవై యింకేవసించుండవలెనని నాకోర్కె.

వీర — రాజా! నీకిట్టికోర్కె యుండుట సహజమేకాని వీరాగ్రేసరులకది కానిపని.

తే॥ రాజు, విక్రమోపార్జిత ♦ రాజ్యలక్ష్మి
చెట్టవట్టినఁ గీర్తినా ♦ర్జించుఁగాని

శ్రీ



# Veera Prathap.

# వీరప్రతాప్.

## చతుర్థాంకము.

[ వీరసింహుఁడును సేవకుఁడును బ్రవేశింతురు ]

వీర — సేవికా! విశేషములేమి?

సేవ — విశేషములేమియని నన్నడుగనేల! (త్రివిక్రముఁడంపిన యీలేఖఁ జిత్తగించినచో విశేషంబులన్నియు సవిస్తరంబుగాఁ దెలియఁగలవు.

వీర — ఏదీ! యిటుతెమ్ము (అందిపుచ్చుకొని చదువుకొనుట నభినయించి నిట్టూర్పుతో) అక్కటా! తానొకటిదలఁచిన దైవమొకటి తలఁచినట్లు సర్వమునాకుఁ బ్రతికూలముగాఁ బరిణమించుచున్నది. కృత్రిమకోపంబున మావిష్ణువర్ధనుని బెదిరింపఁ గాననంబులకేగి విధివశంబున నిటఁజేరి విషయసుఖలాలసుఁడనై ప్రకృతోద్దేశమును మఱచి మాతృదేశంబునకెంతయో యొగ్గొనర్చినవాఁడనైతిని ఆహా! విషయసుఖంబులెంత యరిష్టదాయికంబులు! ప్రాణగాఢంబులగు రాజకార్యంబులందైన నిర్లక్ష్యభావమే వహింపఁజేయును. లోకవిదా

వణాంబగుచుండినను బ్రాలుమాలికతో నుండఁజేయును. అపార విషయసుఖంబులు గాముకజనశ్రేణి మానసాపహారణకారణం బులు. కాముకులకుఁ గన్నులుండవనుమాట నాయెడసార్థకం బయ్యెఁగదా!

తే॥ గీ॥ చారుబింబాధరోష్ఠ సు ♦ ధారసంబు
మధుపముఁబోలెఁ గ్రోలిప్ర ♦ మత్తులగుచు
మదనసంగ్రామకేళి ని ♦ మగ్నులైన
మాదృశులకెడ! రాజధ ♦ ర్మంబులేడ!॥

నేనుదేశంబునువీడి చిరకాలమైనను దానిస్థితిగతులనింత దనుక నరయనైతిని. ( ఉత్తరముతిరిగిచూచి తలపంకించి ) ఏమీ! విష్ణువర్ధనుండు దానోనర్చినపనికై చింతించుచు క్షమాపణఁగోరి నాఁడని వానిప్రియసచివుఁడైన త్రివిక్రముఁడీలేఖను బంపెను. ఇంకొకసారి చదివెదను. ( చదువనారంభించును )

" రాజవీరాగ్రణీ !

మాగధేయసైన్యంబు లాంధ్రరాష్ట్రంబును జుట్టుముట్టినవి. మాయందు నీపూర్వాభిమానమును వహించి సత్వరంబునవచ్చి మమ్ము శత్రులబారినుండి తప్పింప మిమ్ముఁ బ్రార్థించుచున్నారము. విష్ణువర్ధనుం డతిమూర్ఖుఁడనియు, వివేచనాసూన్యుఁడనియు, దుర హంకారియనియు, నీవెఱుంగవా? అతనికోపంబు క్షణభంగురంబు గానఁ బశ్చాత్తప్తుఁడై మిమ్ము క్షమాపణఁగోర సిద్ధముగాను న్నాఁడు. నీ విదియంగీకరింపవేని దేశమెల్ల నాశనమగును. ఇట్టి యెడ మమ్ముద్ధరించుటకు నీకన్నవేఱెవ్వరును లేరు. మీరు కాననాంతరముల కేగిన సమాచారమును వినినతోడనే రాజు ఱెక్క లు విఱిగిన పక్షివలె ధైర్యపక్షములుడొల్లి మానవపక్షియై విచార సముద్రతరంగమధ్యమునఁ జుక్కానిలేని నావవలె డోలాందోళిత మానసుఁడై మగధభట రుధిరసంఘాతంబులచే విచ్ఛిన్న హృద

యుండై ప్రజామోదంబునకు స్పర్ధ ఒనరించి ప్రాణావశేషుండై యున్న వాఁడు. నీ కోపంబునకుఁ గారణంబు తనకృత్యంబుగా నెఱింగి నాటంగోలె సర్వజనంబుల సమాదరణబుద్ధితోఁ జూచుచు వారియనురాగంబులకుఁ బాత్రుఁడయ్యెను. చాళుక్యుఁ డాముకళింగపురంబున నుండుటవిని యీ విషయము దెలియఁజేయింపుచున్నాఁడు. మీరాక కనుక్షణంబును నిరీక్షించుచున్నారము.

ఇట్లు సువిధేయుఁడు

త్రివిక్రముఁడు. ”

మాగధయువతి పంధిపిత్రాజ్ఞాబద్ధులై దాడివెడలిరఁట. ఏమి! వీరిసాహసము! ఇన్నిదినాలు కలుగులం దాఁగి నేఁడు వీరసింహుఁడు లేఁడని సాహసించిరిగాఁబోలు. అవురా! వీరెంత పిఱికి పందలు.

మ॥ అరిరాజన్య భయంకరుండగు నే ♦ నాంధ్రావనిన్ గుప్తరన్
సిరమెత్తన్ జవలేని భీతహృదయుల్ ♦ జీవంబులం దాసచే
నరనిర్గమ్య వనప్రదేశముల నుం ♦ డన్ నేఁడెటుల్ శ్వానముల్
దెరువంబట్టి గృహంబుఁజొచ్చు విధిఁదో ♦ తేరన్ జలంబూనిరో॥

ఎదిరినిల్చి పోరలేని యెట్టిచేతలు పిఱికివారలగు వీరికింకఁ గాక! ఏదెట్లున్నను మదాంధ్రరాజ్యలక్ష్మికి మాగధేయులచేఁ బరిభవంబు గల్గకుండ సంరక్షింపవలయును. ఉపస్థైఁగోపంబున నే నీసమయంబున నూరకుంటినేని నిందాస్పదుండనగుదును. మాయాంతఃకల్లోలములచే రిపులకెంతమాత్రము నవకాశమొసంగఁజనదు. (సేవకునిదిక్కై) సేవకా! నీవు సత్వరంబుగఁ గల్యాణపురంబునకరిగి నేఁటిరాత్రియే వీరసింహుఁడు బయలుదేఱి వచ్చుచున్నాఁడని విష్ణువర్ధన త్రివిక్రమాదుల కెఱింగించి సర్వసైన్యసమేతులై యుండవలసినదని నావచనంబులుగాఁ జెప్పుము.

సేవ — చిత్తము సెలవుతీసికొనెద. (వెడలును)

వీర — నేఁడుగా కృతార్థుండనైతిని. నామాయోపాయంబులెల్లఁ బ్రతిఫలించినవి. విష్ణువర్ధనుని వశీకృతుంజేసికొంటిని. ఇంక శాత్రవులతోడి సంగ్రామంబు కందుక కేళిసమంబు. కావున నిఁకఁ గాలయాపనముఁజేయంజనదు. ( దిక్కులుపరికించి ). అదిగో! పరిచారకుఁడెవఁడో యిటువచ్చుచున్నాఁడు ( విను టనభినయించి ) ఓయి! ఏమనుచున్నావు. దేవిగారు నాకొ కకై నిరీక్షించుచున్నాగసియా! మంచిదిదిగో! వచ్చుచుంటిని. (నిష్క్రమించినమీఁది తెరయెత్తఁబడఁగాఁ దిరిగి జగన్మోహిని తోఁ బ్రవేశించును. )

మోహి — నాథా! నేఁడేల యింతపొద్దుపోయినది?

వీర — ప్రేయసీ! నేఁడాంధ్రరాష్ట్రంబునుండి సేవకుండొకఁడరు దెంచెను.

మోహి — ఆతఁడెందులకై వచ్చెను.

వీర — ఆంధ్రనాయకుండగు విష్ణువర్ధనుని పనుపున నాకొకలేఖం గొనివచ్చెను.

మోహి — అందలి వృత్తాంత మే నెఱుంగవచ్చునా?

వీర — మఱేమియును లేదు. అవశ్యముగా నొకసారిరమ్మని.

మోహి — అవశ్యముగా రమ్మనుటకుఁ గారణమేమైయుండును?

వీర — దేశసంరక్షణార్థమై కాక వీరులతో నింకేమి యావశ్యక ముండును.

మోహి — ఇంతదనుక రక్షణతప్పి యున్నదా?

వీర — లేదు. నూతనముగా శత్రువులు చుట్టుముట్టుటచేఁ గాపా డఁబోవలయును.

మోహిని — ( దిగ్భ్రమతో ) అయ్యో! మీరిప్పుడు యుద్ధమున కై పోవలయునా?

వీర — అవును.

మోహి — నాథా! మిముఁబాసి యొక్క క్షణమైన నుండఁజాల. మీరుయుద్ధంబునకేగుదురేని పునర్జన్మముననైన మీరుండుతా వునవచ్చి చేరుదాన.

వీర — చెలియా! యేల వెలతనమువహించెదవు. క్షత్త్రియుం డనై పుట్టి సంగ్రామరంగమే కేళిమందిరముగా నెంచు వీర పురుషుండనై యిట్టి విపత్కాలంబున నిరంతర నారీలోలుండనై యుండిన లోకులెల్ల నవ్వరా? దేశద్రోహినిగానా? దేశ ద్రోహంబునకన్న మహాపాతకంబు గలదా? అట్టిపాతకులు మాతృభూమికి దుర్భరులుగదా! మానవుండెప్పుడును జిరస్థా యియగుకీర్తి నార్జింపవలయునేకాని చంచలవిషయానందంబులఁ దగుల్కొనిన లాభమేమి? విషయానందంబు మానవసత్త్వ నిరుత్సాహకరంబు. చిత్తచాంచల్యదప్రభాప్రోత్సాహకరంబు నై యున్నది. కావున దానికి దూరస్థులై యుంట శ్రేయంబు. అదియునుంగాక!

ఉ॥ మానవజన్మ మెత్తి యభి ♦ మానము గల్గిన బంటనౌచు భూ
జానికిఁ దోడునీడవలె ♦ సంచరణంబొనరించి మాతృసం
స్థానము శత్రువర్గ జల ♦ దంబులచేఁ బరివేష్టితంబుగాఁ
గానిటులూరకుంట దగు ♦ కార్యమె? నిక్కపు వీరకృత్యమే॥

మోహి — ప్రాణనాథా! మీరువచించినదెల్ల నిక్కమే కాని యచిరకాలంబుననే కల్గిన యీవియోగవార్త దుర్భరంబైన దుఃఖంబును గల్గించుచున్నయది.

తే॥ సూర్యచండాతపంబున ♦ శుష్కమగుచుఁ
దొలకరించిన లేఁజిగు ♦ రులు జనించు
వృక్షము పయినఁబడినట్టి ♦ పిడుగుపోలె
నచిర సంగమాంత వియోగ ♦ మార్తిగూర్చు॥

వీర — తరుణీ! యిట్టియెడ నీదుఃఖ మమంగళ సూచకంబుగావున ధైర్యమవలంబించి చింతనుడుగుము. నేననతికాలంబుననే వచ్చి నిన్నుదర్శించెదను. గాన నిదియొక వియోగంబుగాఁదలంపకుము.

మోహి — నాథా! యీయుద్ధపునెపంబున నెయేదేశంబులకేగెదరో. ఎప్పుడువత్తురో. అప్పటికి నేనుజ్జప్తినుండినఁగదా తిరిగి వచ్చుట నన్నుదర్శించుట.

వీర — ప్రేయసీ! ప్రేమాబంధంబులు నడలింపక చిక్కఁబట్టినచోఁ ద్రిలోకంబులం దెందున్నను జెంతనున్నట్టులనే భావింపనగును. నిష్కలంక ప్రేమాయుతంబుగాని సంయోగంబు వియోగంబుకన్న దుఃఖభాజకంబు. ప్రేమామృతంబునకు దూరసామీప్యములనుభేదంబులు లేవు. పారావారంబులకన్న నపారమైనది. అతినిగూఢమైనది. దానిలోఁతు దానినాస్వాదించువారల ననుసరించియుండును. తదితరులకదిదురవగాహంబు. కావున సంశయింపక నీయఖండప్రేమాతిశయంబులఁగోలుపోవక నిరంతరధ్యానాసక్తవై యుందువేని కొలఁదికాలంబుననే నిన్నుఁజేరఁగలవాఁడ. ఇంకొక ముఖ్యవిషయమునుగూర్చి నీకుఁ జెప్పవలసి యున్నది.

మోహి — ఏవిషయము?

వీర — నీవిప్పుడు గర్భవతివిగదా! కొన్నిదినంబులలో మనకు సంతానప్రాప్తియగును. కాన నీరక్షనుదీసికొనుము. దీనిధరించిన వారల కఖిలైశ్వర్యములు గల్గును. స్త్రీశిశువు జనించెనేని దీని నా పెకంఠమునకుఁ గట్టుము. ఘనతరైశ్వర్యసుఖప్రాప్తి ప్రత్యంబు లామెకగును. పరమేశ్వరుండు కుమారరత్నమును బ్రసాదించెనేని దీనినాతని కరంబునకుఁ గట్టుము. దానినాతఁ డెప్పుడును ధరించునట్టులఁజేయుము. అది వానినొక మహాపురుషునిగా నొనర్చును. దీనిప్రభావంబున వయోప్రాదుర్భావంబునొందిన మనంబు ఘనకార్యోద్యమములకై పురికొల్పును. ఎట్టి భయోత్పాతంబులకుఁగాని వెనుకంజవేయఁడు లోకపూజ్యుఁడ

గును. అట్టివాని ప్రఖ్యాతనామ మాచంద్రతారార్కస్థాయి
యైనిల్చును. కావునట్టి కుమారజనన సమాచారంబుచే
నాకు శ్రీవణోత్సవంబు గావింపుము.

మోహి — ( ఆలోచనతో ) మంచిది. అటులనే చేసెదను. (అని
దానిని దీసికొనును. )

వీర — ప్రియసీ! తెల్లవాఱవచ్చుచున్నది. నేనీసమాచారంబు
నీజనకున కెఱింగించి సత్వరంబుగఁ బోయెదను. ధైర్యమవ
లంబించి యుండుము. [ వెడలిపోవును]

మోహి — తే॥ కష్టసుఖముల కాలచ ♦ క్రంబునందుఁ
గష్టభాగంబు కడుమంద ♦ గతిఁజలించు
సౌఖ్యభాగంబొ జరజర ♦ సాగిపోవు
మెఱపుఁదీఁగలు మెఱసిన ♦ తెఱఁగుదోఁప ॥

అటులనే నా సౌఖ్యంబులును క్షణభంగురంబులైనవి. ఇంక
నాథుండెన్నిదినంబులకు వచ్చునో యంతదనుక నీవియోగసాగర
మేలాగునఁ దరింతును? నానాథుని వాక్యములు విపరీతార్థమును
స్ఫురింపఁజేయుచున్నవి. దానిభావమును నాకుఁదెలియఁజేయుటకు
నాప్రియచేటియైన చతురిక యింకనురాలేదు. ( అని తలవంచు
కొని కూర్చుండును. )

చతు — (ప్రవేశించితనలో) ఇదేమి! యీపెయిట్లున్నది.

ఉ॥ పాడిదొరంగినట్టి కచ ♦ భారము సంస్కరణంబులేని పూ
బోఁడి హిరణ్మయాభరణ ♦ ములీ సిళయంతయు నిద్రలేమిచే
వాడినమోముదమ్మి నిడు ♦ వాలుకనుంగవ కెంపుపెంపు మా
చేడియచిత్తవృత్తులను ♦ జెప్పక చెప్పుచునున్నవేలకో ॥

అక్కటా! యీమె తనూవిలాసములఁజూడ నేమికతంబుననో
చింతావ్యాకులితయై యున్నట్లు తోఁచుచున్నది. ఇట్లుండుటకుఁ
గారణమేమి? సమీపించి తెలిసికొనియెద. ( సమీపించి ప్రకా
శముగా ) నెచ్చెలీ! నీముఖవిలాస మింతచెన్నుదఱిఁగియుండుటకుఁ

గారణమేమి ? ప్రాణసఖినగు నేనెఱుంగఁదగని రహస్యంబు లుండ నేరవుగదా ? కావున నీచింతకుంగల కారణమెఱింగింపుము. శక్తి వంచనలేక దాని నివారింపఁ బ్రయత్నించెద.

మోహి — చతురికా ! నామనోనాయకుండు నన్నువిడనాడి నేఁడు రణరంగంబున కేగెను. కాన భర్తృవియోగమే నాచింతకుం గల కారణంబు.

చతురిక — సఖి ! ఏలనీకింత వ్యాకులతనము ? మగవారెవ్వరును నింతులచెంతనే వసింతురా ? అందునీమగండు పౌరుషశాలియగు ధీరాగ్రేసరుండు. ధీరాగ్రేసరులగు వారలకు వైరిజనకోలాహలంబులే సంతోషదాయకమ్ములగుఁ గాని కామినీజనమదన కోలాహలంబులంత రుచింపవు. అవియునుంగాక.

తే॥ పురుషసింహంబతఁడు రణ ♦ భూమినిలిచి
శాత్రవ గజేంద్రములఁగూల్చి ♦ జయముగాంచి
రమణి ! సుఖముగ నేఁడెల్లి ♦ రాఁగలండు
గానఁ జింతింపనేల ని ♦ ష్కారణముగ ॥

మోహి — చెలీ ! వానిగమనంబున కంతగాఁజింతింపనుగాని నన్ను వీడ్కొనిపోవునపుడు వానినోటినుండి వెల్వడిన మాటలుమాత్రము నన్నింతగా వేధించుచున్నవి. ఆమాటలంబట్టిచూడ నాతఁడు తిరిగివచ్చునట్లు తోఁపదు.

చతు — ఆతఁడేమని వచించెను?

మోహి — నాకు స్త్రీశిశువు జనించెనేని దానికంఠమున నీరక్షఁ గట్టిన నదిసకలశుభంబుల నొసంగుననియు దైవకృపచేఁ బురుషశిశువు జన్మించెనేని వానికరంబున కీకంకణముఁగట్టిన నిదివానిమహోన్నతికిం దెచ్చుననియు, నట్టికుమారరత్నము జన్మించినవెంటనే తన కెఱుఁగఁజేయవలయు ననియుఁజెప్పి వెడలిపోయెను.

చతు — అందు నీసంతాపమునకుంగల కారణమేమి ?

మోహి — కుమారునియొక్క జన్మవృత్తాంతమే తెలియఁజేయు మని చెప్పుటకుఁ గారణ మేమైయుండునో యని.

చతు — బహుశః! కుమారుఁడైనచోఁ దనవెంటఁ గొంపోవనెంచి యట్లు చెప్పియుండును.

మోహి — అది మఱింత సంతాపకరముగదా ?

చతు — అవును! నిక్కమే (ఆలోచించి) దానికిఁదగిన యుపాయమును మనమొకటి పన్నుదము.

మోహి — ఆయుపాయమేమి ?

చతు — దైవకృపచేఁ బుత్త్రుఁడే జన్మించినచో వానిజన్మవృత్తాంతమును మఱుఁగుపఱచి స్త్రీశిశువు జన్మించినదను వదంతిని వ్యాపింపఁజేయుదము.

మోహిని — నెచ్చెలీ! అదెట్లు సాధ్యమగును ? దూరదేశంబున నున్న నాభర్త నేఁడెఱుఁగకున్న నెఱుఁగకపోవచ్చునుగాని మన యూరివారికైనఁ దెలియకుండునా ? తెలిసినచోఁ గొంత కాలమునకైనను వానికిఁ దెలియకమానదు ఏలయన ?

తే॥ పెదవిదాఁటిన మాటలు • పృథివిదాఁటు
నవెడిసామ్యమ్ము నకును న • పార్థమున్నె ?
లోకమును మాయఁగలుగదే • మూఁకుడనుచుఁ
బల్కెదేటికి నగుబాట్ల • పాలుగాఁగ ॥

చతు — చెలీ! అట్లనవలదు. మనపురంబులోని ప్రజలకును నంతఃపురజనంబులకును గడకు మానరాజునకుఁగూడఁ దెలియకుండ రహస్యముగాఁ గాపాడవచ్చును. అంతియేకాక యట్టివాని జన్మవృత్తాంతము శత్రువులెఱింగినచో వైరికుమారుఁడగుటంజేసి హానియొనర్పవచ్చును. కావునఁ దజ్జన్మవృత్తాంతము కడురహస్యంబుగా నుంచుట శ్రేయస్కరంబు. స్త్రీశిశువు జనించినచో నేభయంబును లేదుగదా ? దీనికై నీవింతపొగుల నేల ? చింతనుడుగుము. గర్భవతులకింత వంతదగదు. నీగర్భం

బున మహావీరాగ్రేసరుండున్న నట్లు నాయంతరాత్మ ప్రబోధించు చున్నది. కావున దిగులొందక యంగసంస్కారములఁ గావించుకొనుము. ( పరికించి ) రాజుగారును మంత్రియు నేలకో యిటువచ్చుచున్నారు. కాన మనమిటనుండుట మంచిదిగాదు. లోనికిఁబోవుదము రమ్ము. ( అని నిష్క్రమింతురు. )

( మాధవవర్మయును మంత్రియును బ్రవేశింతురు )

మాధవ — సచివా ! మనప్రయత్నములన్నియుఁ దుదకు వృథయైనవిగదా ? ధీరస్వాంతులగువారి మనంబులఁ గలంచుటకు మాయోపాయము లెంతమాత్రమును బనికిరావు. ఉత్తము లగు వారెప్పుడును స్వలాభమునకై దేశవిద్రోహులుగాఁ జాలరు. రాజునకును దనకును వైరకారణమున్నను దానికినై దేశమును నాశనదేవత పాలొనర్చు నీచాత్ముఁడుగాఁడు. ఇంక వానిని మనపక్షమునకుం ద్రిప్పఁజాలము. కావునఁ గర్తవ్యాంశము నాలకింపుము.

మంత్రి — రాజా ! యింకఁ గర్తవ్యాంశమేమున్నది? శక్తి గల్గినఁ బోరాడుటయు లేదేని యూరకుండుటయు.

మాధ — ఛీ! క్షత్రియోత్తములకుఁ బరప్రకర్షంబు లతిదుస్సహంబులుగదా ?

కం॥ సముఁడగు శాత్రవుఁడు పరా
క్రమమున నెదిరించిపోరఁ ♦ గంపితమతినై
సమరంబు సేయకుండిన
క్షమియింతురె నన్నుదోడి ♦ క్షత్రియులవనిన్ ॥

అవురా ! నాఁడు దీభుజబలంబులచే స్వాతంత్ర్యము నార్జింతుమని కర్ణకఠోరంబులగు వాక్యములచే నెత్తిపొడిచినందులకుఁ దగుప్రతిక్రియ సేయకుందునా? ఆవాక్యములు నేఁటికిని నాహృదయములో శూలాయమానములై మెలంగుచున్నవి.

మంత్రి — రాజా! నాకొకయుపాయము దోఁచుచున్నది. వీరసింహుఁడు మాగధేయులతోఁ బోరాడఁబోయెనుగాన మనముఁ బోయి వారికేవిధముగానైన సాయమొనర్చి వారిని విజయులుగాఁజేయుదము.

మాధ — మంచియుపాయముఁ జెప్పితివి. అటులనే చేయుదము రమ్ము.

(అని నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము



శ్రీ



# Veera Prathap.

# వీరప్రతాప్.

## పంచమాంకము.

[ చతురికయును మాలితియును బ్రవేశింతురు ]

**మాలతి** — చతురికా! చతురికా! అంతఃపురకార్యములన్నియు నీచేతిమీఁదుగనే జరుగుచున్నట్లుగాఁ జెలిమికత్తెలనైనఁ బలుకరింపక పరుగెత్తుచున్నావేమే!

**చతు** — మాలతీ! నిజమె పరసేవకై కాయమమ్ముకొనినమీఁదట వారికార్యములన్నియు స్వకార్యములుగా భావించి జాగరూకతమై మెలంగవలయు. వారివీక్షణము లతి చంచలములు. వారికృపాకటాక్ష మున్నంతవఱకు స్వాధికార ప్రమత్తతచే విఱ్ఱవీఁగుదుము. ఇంచుకంత యది గుఱితప్పినచోఁ గోపారుణితనేత్రముల కాహుతియగుదుము, అందువలన నంతఃపురసేవ యసిధారావ్రతమువంటిది. తద్రహస్యము లతినిగూఢంబులు. కావున నొకరహస్యకార్యావసరమునఁ బోవుచున్నాను.

**మాలతి** — చతురికా! చెలులమఁగూడఁ జెప్పఁదగని రహస్యము లుండునా?

**చతు** — ఆఁడువారినోటమాట దాఁగదుగదాయని శంకించుచుంటిని.

మాలతి — చతురికా! శంకమాని నీచెలినగు నాకుఁగూడ నావృత్తాంతము నొకింత చెప్పుమా?

చతు — (తనలో) ఇదెట్లును జెప్పకున్న విడుచునదిగాదు. ఈవిధముగాఁ జెప్పెదను (ప్రకాశముగా) చెలీ! మనజగన్మోహిని నేఁటిప్రాతఃకాలమున నొక(స్త్రీ)శిశువుం గనియెను. తద్వృత్తాంతము రణరంగంబుననున్న వీరసింహుల కెఱింగించుటకై యొకబ్రాహ్మణోత్తముని బంపివచ్చుచున్నాను.

మాలతి — ఔరా! నీవునిజముగాఁ జతురికవేనే. నీరహస్యములు మామిుందేకాని లోకమును మూయఁ జాలవు గదా. జగన్మోహినికిఁ గుమారుఁడు జనించెనని నేనిదివఱకే వింటిని.

చతు — మాలతీ! నీకెవరుచెప్పిరోకాని యదివట్టిమాట. నాకన్నమీకెక్కుడు తెలియునా?

మాలతి — చతురికా! యెవరోయనుకొనుచుండఁగా వింటిని.

చతు — (ఆశ్చర్యము వహించి--తిరిగి శాంతముగా) పొరపాటున వినియుందువేమోకాని నిజముగా (స్త్రీ)శిశువేజనించినది. ఒకవేళఁ గుమారుఁడే జనించినచో సంతోషదాయకమే కదా? దాని దాఁచిపుచ్చనేల?

మాలతి — పరిహాసమున కట్లనుచున్నావేమోయని.

చతు — మాలతీ! నీతో నెప్పుడైనఁ బరిహాసమాడితినా?

మాలతి — లేదుకాని జనవాక్యమునకును నీమాటలకును వ్యత్యాసముండుటచే నట్లంటిని.

చతు — లోకములోని వదంతులకేమిలే! పుట్టని బిడ్డకుఁగూడను పేరు వెట్టుమందురు గదా! అదియునుంగాక యెల్లరును రాజుగారికి మనుమఁడుపుట్టిన బాగుండునని తలంచుచుండిరి. నేఁడు మోహిని ప్రసవించిన దనినతోడనే సంతోషాతిశయమునఁ గొందఱీవదంతి వ్యాపింపఁజేసియుందురు.

మాలతి — చతురికా! కావచ్చును. తొందరగాఁ బోవలయును గాఁబోలు పోయిరమ్ము నేనును బోయెదను.

(నిష్క్రమించును)

చతు — అయ్యో! నేనెంతవలదని చెప్పినను రాజుగారు వినక పిల్లవానిజాతకము సిద్ధాంతిగారికిఁ జూపించినాఁడు ఈరహస్య మీతనివల్లనే బయల్పడియుండవచ్చును. కానిమ్ము తద్రహస్యమిఁకనైన జాగ్రత్తగానుంచి వీరసింహునకేని తెలియకుండఁజేసెదను. దేవినాకొఱకై నిరీక్షించుచుండవచ్చును గాన నేనును బోయెదను. (నిష్క్రమించును)

ఇది ప్రవేశకము

[కల్యాణపురప్రాంతము. బ్రాహ్మణుని ప్రవేశము]

బ్రాహ్మణుఁడు — (తనలో) నేఁటికిత్రిలింగరాష్ట్రంబును జేరఁగలిగితిని మార్గాయాసమునఁ గడుడస్సితిని. కాన నీశీతల తరుచ్ఛాయలందొకింతసేపు విశ్రమించి తదుపరి నాసందేశముం గొంపోయెద. వీరసింహుఁడిప్పుడు రణోన్ముఖుండై యుండును. ఇట్టిసమయమునందీ సందేశమెట్లు నివేదింతును? నేనిప్పుడొకవేళ వీరసింహుని జేరఁబోయినను వానిసైనికులు నన్నుగాంచి ప్రతిపక్షినిగా నెంచి దారుణకృత్యమొనర్చిన నొనర్పవచ్చును. దానఁగార్యభంగము వాటిల్లును. కావున స్వల్పకాలమిచ్చటనే యుండెదను. (అని పరుండును — తెరలో ధ్వనివినఁబడును చెవియొగ్గి) ఏమిది! ఎక్కడనో భేరీపటహ నినాదములు వినఁబడుచున్నవి. నేను యుద్ధరంగంబున కనతిదూరముననే యుండినట్లున్నది. ఈకొండనెత్తమ్మునకెక్కితినేని యిరుపక్ష

ముల వారలేవిధంబున రణమొనర్చుచున్నదియుఁ గాంచఁగల్గు దును. కావున నట్లుచేసెదను. (అని పర్వతారోహణమొనర్చి నట్లభినయించి) ఆహా! సమరతలంబెంత భయంకరముగా నున్నది.

ఉ॥ కందుక కేళిసల్పెడు ప్రకారము కార్ముక చాలనోద్ధతిన్
వందలువేలు శత్రుభుజ పంజరముల్ దెగునట్లుచేసి మ
ధ్యందిన భానుఁడోయనఁగ నాయతబాహుఁడు వీరసింహుఁడీ
యందఱికొక్కఁడై నిలిచె నాహవమర్మ విశారదుండుగన్॥

సీ॥ శరపరంపరవృష్టి కురిపించునొకచోట
నుక్కడంచును వైరి నొక్కచోట
ఖడ్గాహిఁ గేరఁజేసి ఖండించునొకచోట
రిపుశిరంబులను మర్దించునొకట
అశనిపాతప్రగదా హతిఁగూల్చునొకచోటఁ
గ్రోధాగ్ని నొకచోటఁ గురియఁజేయు
రథకేతనంబుల రాల్చు నొక్కొకచోట
'మాంపాహి' యనువారి మనుచునొకట

గీ॥ ఔర! యీరీతి జగదేక వీరుఁ డగుచు
నెచటఁజూచినఁ దానయై యేపుమిగిలి
తాండవంబాడు నాపురాంతకుని భంగిఁ
గాలుచున్నాఁడు రిపుభయంకరుఁడుగాఁగ॥

ఏమి! కురంగ శాబకములపై కుఱుకు సింగంబు చాడ్పున శత్రువర్గంబులపై వీరసింహుఁడుజికి చిందరవందర గావించుచుఁ జీకాకుపఱచుచుఁ దనభీమగదా ఘాతంబులచే వైరిమస్తకమస్తిష్కములఁ గ్రక్కించుచుండినను రాజసేవాధురంధరులగు మగధసైనికులు గొందఱు తమప్రాణంబుల నాహవరంగంబునకు బలియిచ్చుటకు సంసిద్ధులై ఖద్యోతమండలంబుపై కెగయు ఖద్యోతముల

భాతిఁజెలంగుచున్నారు. ఆహా! వీరిధైర్యమతి ప్రశంసనీయము గదా. నిక్కంపు వీరునకు రాజాజ్ఞాపరిపాలనమే స్వర్గము. ఐహికేచ్ఛలెంతమాత్రమును వారిమనంబులఁ గలంపనేరవు. దారపుత్రాదిసుఖానురాగంబులు దానిముందు నిల్వనేరవుగదా! ఇట్టివారికి వీరస్వర్గంబు సంప్రాప్తమగునన్న నాశ్చర్యమేమున్నది? దేశద్రోహులగు పిఱికిపందలు గొందఱు తమభుజబలంబు లడుగంటుటంజేసి శాత్రవునకు వెన్నిచ్చి తమపిఱికిబలంబును జూపుచుండిరి. (దిక్కులు పరికించి). అదిగో వీరసింహుఁడేలకో చేయియెత్తి యభయమిచ్చువానివలె నేమియో చెప్పఁబోవుచున్నాఁడు. విందుఁగాక. (చెవియొగ్గి) ఆ. తెలిసినది. నిశాసమయమాసన్నమగుటంజేసి నేఁటికి సమరమాపవలసినదనియు రేపకడ ద్విగుణీకృత పౌరుషంబులతోఁ బోరాడవలయుననియు హెచ్చరించుచున్నాఁడు. కాన నేనును వానిశిబిరమునకేగి నాసందేశమును దెల్పెదను. (ముందునకునడచి) వీరసింహుఁడీయెడకే వచ్చుచున్నాఁడు వానినిక్కడనే దర్శించెదనుగాక. (దిగివచ్చి)

[వీరసింహుఁడు ప్రవేశించును]

బ్రాహ్మ — వైరిసంహారరంహా! వీరసింహా! జయము. జయము.

వీర — అయ్యా! మీరెవరు? ఏకార్యార్థమై యిందువేచియున్నారు.

బ్రాహ్మ — రాజా! కళింగదేశాధీశ్వరుని కొలువునందుండు బ్రాహ్మణుండను. తమకొక శుభవర్తమానమును దెలుపవచ్చితిని.

వీర — (సంతోషమున) అయ్యా! ఆశుభవార్తయేమి?

బ్రాహ్మ — తమకొక పుత్రికారత్నము జనించినది.

వీర — (అదరిపడి) ఏమి! పుత్రికయా!

బ్రాహ్మ — అవును. పుత్రికయే?

వీర — మంచిది? యింకని శేషములేమైనఁ గలవా?

బ్రాహ్మ — ఇంతకుమించిన విశేషములేమియును లేవు.

వీర — అయ్యా! మార్గాయాసముచేఁ గడుడస్సినట్లున్నారు. అనతిదూరంబున నేత్రానందకరమగు ప్రాసాదమొండు గాన్పించుచున్నది. అదియె నామందిరంబు (సేవకునిబిలిచి) ఓయీ! వీరిని నా నిలయంబునకుఁ గొనిపొమ్ము. (బ్రాహ్మణుని వంకఁ జూచి) అయ్యా! మీరు వానివెంటఁ బొండు. నేనిదే వచ్చెదను.

బ్రాహ్మ — చిత్తము. (అని బ్రాహ్మణుడు ప్రాసాదమునకుఁ బోవును.)

వీర — (తనలో) ఛీ! ఈ పండితులెంతనీచులు. మెఱమెచ్చునకై యున్నవి లేనివన్నియును జెప్పి పొట్టకూటికై పాపమునకొడిగట్టుకొనుచున్నారు.

తే॥ గీ॥ అఖిల నిగమాగమంబుల నభ్యసించి
యిచ్చకంబులకై లేని మెచ్చులాడి
వందిమాగధులట్లు జీ వనమొనర్చు
వారలారయఁ భువికి దు ర్భరులుగారె?॥

వారు నా కఖండతేజశ్శాలియగు కుమారుఁడొకఁ డుద్భవించుననియు వానిచే నాయశశ్చంద్రిక జగద్వ్యాప్తమగుననియు వక్కాణించియుండిరి. ఏతత్పుత్రరత్న జననవృత్తాంత శ్రవణాభిలాషిణియగు హృదయంబునందీ వృత్తాంతము చే నింతబండవడినట్లయ్యె. చిరతరోత్సాహమెల్ల నిర్మూలమయ్యెను. పుత్రికాశబ్దంబు నాహృదయపుటంబు చించివైచుచున్నది. వీరాగ్రేసరులకుఁ దమంతటి కుమారులుగలిగినప్పుడే కదా వారిసంతోషమునకు మేరతప్పుట. స్త్రీలెంత ధైర్యశాలినులైన నబలలే కదా?

(ఆలకించి) ఏలనాకీ వెఱ్ఱిభ్రమ! అబలలయ్యును సబలలై పేరొందిన నారీశిరోరత్నము లెందఱేయార్యావర్తమందు లేరు. వారలవలె నాకుమారైయును గాఁగూడదా! కుమారుఁడైనచోఁ దనయింటికే ప్రఖ్యాతిఁదెచ్చును. కుమారైయైనచోఁ బుట్టి నింటికిని మెట్టినింటికిని గూడఁ బేరుదెచ్చును. కానఁ బుత్రికాజన నమునకై చింతించు టనుచితంబు [దిక్కులుపరికించి] ఎవరో వచ్చుచున్నట్లున్నది.

(స్వరముమార్చి) ఓహో! మానాయునగారి మిత్రుఁడగు ప్రియదాసిటు వచ్చుచున్నాఁడు. కారణంబేమియోకదా (అని ముందునకునడచును)

[ప్రియదాసు ప్రవేశించును]

ప్రియదాసు — వీరసింహా! నీకు జయమగుఁగాక!

వీర — అయ్యా! నమస్కారము.

ఉ॥ ఎక్కడనుండిరాక సుఖ ♦ మే జనకుండు సపర్యలందుచున్
జక్కఁగనుండునే మదిని ♦ నన్నెపుడైన స్మరించుచుండునే
తక్కిన బంధువర్గములు ♦ తత్పరివారలు క్షేమమేకదా!
చక్కఁగఁదెల్పి నామదిని ♦ సంతసపెట్టఁగదే బుధోత్తమా ॥

ప్రియదాసు — వీరసింహా! ఎల్లరును సేమమేకాని కులవృద్ధగు నీజనకుండు జరాభారంబుచేఁ గృశించి కొలఁది దినములనుండి శయ్యపైనుండియేని లేవఁజాలనిస్థితిలో నున్నారు. దృఢగా త్రుఁడగుటచే నింతదాఁక నీవెందుండినను నేమొడ కేగినను జీకుఁ జింతయు లేక పరసాహాయ్య మెంతమాత్రముం గోరక దేహయాత్ర సల్పుచుండెను. ఇప్పుడో వయోవృద్ధుండయ్యెను. అర్ధాంగియూ మున్నెగతించెనుగదా? కావున వృద్ధుండగు నీజ నకుని దగుసపర్యల నాదరించుటుచితము. నీజనకుని పంపు ననే నీకీసమాచారము తెలియఁజేయుటకై వచ్చితిని.

వీర — అయ్యా! నేడు చాలవిచారకరమైన వార్తవింటిని. కాని

మ॥ పితృనాజ్ఞా పరిపాలనంబొకటఁ బృ ♦ థ్వీనాధ సంసేవన
వ్రతదీక్షాచరణంబదొక్కయెడ చూ ♦ పన్ నాదుచిత్తంబిఁకే
గతిఁబోవన్ వెనుకాడుచున్నది యహో ♦ కర్తవ్య మూహింపఁగా
ద్వితయంబుఁ సమముల్గదా సలుప సం ♦ దేహంబు వారింపవే॥

శస్త్రజీవులగు మాకొంట్లకు రాజాజ్ఞాపరిపాలనమే ముఖ్యకర్తవ్యాంశమైనను నవసానదశయందున్న పితయాజ్ఞ నెఱవేర్చుటయు సంతతి కర్తవ్యాంశమే! పితృనాజ్ఞ నెఱవేర్పని పాతకము నన్నొకనినే బాధించునుగాని రాజాజ్ఞోల్లంఘనంబున నేను బాధితుండనగుటయేకాక నాతోడి ప్రజలెల్లరు దానిననుభవింతురు. నాయొక్కనికై దేశమును బాధలపాలొనర్చుటకన్న నేనొకఁడ ననుభవించుటయే యుచితము. దారుణ సమరసంకుల సమయంబున నేనిందుండనేని పలువురు పలుతెఱంగులుగ ననుగూర్చి భావింతురు. కావున నెయ్యెడ రణరంగంబునువీడి రాఁజాల. అంతమాత్రమున నాతండ్రిని నిరసించినట్లుగా భావింపక నాజననితో నాప్రార్థనగా నిట్లువచింపుము.

మ॥ అరికాంతారకుఠారమంచు నిలలో ♦ నార్యప్రశంసన్ గనన్
బరిమార్పంగలవాఁడ శాత్రవ లతా ♦ పాశంబులం చొక్కెడఁ
నరనాథాగ్రణి ముందుచేసిన ప్రతి ♦ జ్ఞందీర్చి వేవేగనే
నరుదేరంగలవాఁడ మజ్జనని ♦ ప్రార్థంబు లీడేర్పఁగన్ ॥

ప్రియదాసు — కుమారా! నీతండ్రిగారి కటులనే విన్నవించెదను. కాని నీవు సత్వరముగ రావలయునుసుమా!

వీర — మీరునాకంతగాఁ జెప్పవలయునా? మాతండ్రియాజ్ఞయన్న నెఱవేర్చి తీఱవలసినదేకాని రాజాజ్ఞచే వేఱొకకార్యమున నియమింపఁబడి యుండుటచే సంకోచించుచుంటిని. కావున

నన్యథాతలంపవలదు. ఈసంగతి మాతండ్రిగారి కెఱింగింపుము.— అయ్యో చాలప్రొద్దుపోయినట్లున్నది. మననిలయమునకుఁ బోవుదమురమ్ము ( అని ముందరకునడతురు. )

ప్రియదాసు — [ దిక్కులుపరికించి ] ఓయి వీరసింహా ! ఈచెట్లమాటుననుండి యెవఁడో వచ్చుచున్నాఁడు. యుద్ధరహస్యముల నెఱుంగవచ్చెడు శాత్రవుఁడు గాఁడుగదా !

వీర — శాత్రవుండెన్నగుండెలతో నిందురాఁగలఁడు. ఏది ! రానిమ్ము [ బిగ్గరగా )

తే॥ గీ॥ ఎవఁడవుర నీవిటొంటి ని ♦ శ్శంకముగ
శాత్రవకుటీరములచెంత ♦ సంచరింప
సాహసించుచునున్నావు ♦ సాహసాంక
బిరుదవీరసింహుండు జీ ♦ వించియుండ ॥

[ పాడుచు రాయబారిప్రవేశించును. ]

రాయ — తే॥ గీ॥ స్నేహితుఁడనయ్య ! మీతోడి ♦ చెలిమిసేయఁ
గోరుచున్నట్టి మగధుల ♦ కొఱకురాయ
బారమువహించి వైరిక ♦ టీరఘులకు
నేగుదెంచెడి ననుఁదమి ♦ యింపుమయ్య ॥

వీర — ఏమి ! మగధపతినిన్ను రాయబారిగాఁ బంపెనా ?

రాయ — అవును.

వీర — ఏమని ?

రాయ — మీరాయొక్క బాణాగ్నిచే దంద్యహ్యమానాంగులై కొందఱును విగతప్రాణులై కొందఱును విదళితమస్తకులై కొందఱును రణభూమిన్ద్రెళ్లియున్నవారు. వారింగాంచి నంతనే తక్కంగల సైనికులెల్లరు తమధైర్యకవచముల సడల్చుకొని ప్రాణావశేషులై సంధిగుదుర్పరాయబారమొంపుకొనిరి,

వీర — ఇంతకును బరాజితులైనట్లొప్పుకొనిరా? లేదా?

రాయ — మున్మాటికిని బరాజితులైనట్లొప్పుకొనిరి.

వీర — వారు నిర్హేతుక వైరంబునకుఁ గాలుద్రవ్వి మాకధిక వ్యయప్రయాసంబులు గలుగఁజేసిరి. ఈయుద్ధవ్యయమెల్ల వారు భరించుచుఁ బరాజితులైనట్లొప్పుకొనినచో నటులనే సంధిగా వింతము. ఇపటినుండి యుద్ధమాపుదము. వారందుల కీయకొననిచో దానిఫలిత మనుభవించెదరు.

రాయబారి — ప్రాణార్తులగువార లెద్దానికియ్యకొనరు? కావున మీ నిబంధనల రెంటిని మేమంగీకరించితిమి.

వీర — మంచిది. నీవు రాయబారివిగా వచ్చితివిగాన నేఁటిరేయి విందువై యుండుము. [ప్రియదాసునిదిక్కై మెల్లగా] అయ్యా! యింకమీరరుగుదెంచిన కార్యముకూడ సిద్ధించినదిగదా? రేపు మనమిరువురముగలసి మాతండ్రిగారివద్దకుఁ బోవుదము. (బిగ్గరగా) ఇప్పటికే కాలాతీతమైనది. మన నిలయమునకుఁ బోవుదము రండు. (అని మువ్వురు నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.



శ్రీ



# Veera Prathap.

# వీరప్రతాప్.

## షష్ఠాంకము.

[ఇరువురు పురుషులు ప్రవేశింతురు]

**మొదటివాఁడు** — ఏమోయి! ఎక్కడనుండి రాక.

**రెండవవాఁడు** — క్రీడాగారమునుండి.

**మొదటి** — అందలి విశేషము లేమి.

**రెండవ** — నేడు కుమారధనుర్విద్యా ప్రదర్శనమని వినలేదా?

**మొదటి** — వినియుంటినిగాని కారణాంతరములచే రావలనుపడలేదు. సరికాని ప్రతాపసింహుఁ డేపనులుచేసెను?

**రెండవ** — ఓయి! ఆతని బాహుబలపరాక్రమముల వర్ణించుటకేనుజాలను. నేనేకాదు. వేయినోళ్లుగలిగిన యాదిశేషుఁడును జాలఁడు. వయసునఁ బసిబాలుఁడైనను గదా యుద్ధంబునఁ దనగురునితోడఁ గయ్యంబున కియ్యకొని తనగదాకౌశలముచే నాతనికిఁ దదితరులగు చూపఱకు నాశ్చర్యము గలుగఁజేసెను. గురుఁడు తనపరాభవంబున కించుక ఖిన్నుఁడయ్యును దన్నుమించిన శిష్యుని సంపాదింపఁగల్గినందుల కెంతయు సంతసించుచు

వానిగొనియాడెను. తరువాత ధనుర్విద్యా ప్రదర్శనంబుచే జనులకనులు మిఱుమిట్లు గొనఁజేసెను. ముష్టియుద్ధంబునందుఁ బేరొందిన మల్లురెల్లరునువచ్చిరి. వారినందఱిని నేలంగూల్చెను.

మొదటి — బలే ! పులికడుపున జింకపిల్ల పుట్టునా ?

రెండవ — ఈతని జన్మంబునుగూర్చి యనేకు లనేకవిధంబులుగాఁ జెప్పుకొనుచుందురే. నిజమేమి ?

మొదటి — నిజము భగవంతునకెఱుక ! కాని యేవరంతు లెట్లున్నను వీరసింహునిపుత్రుఁడేనై యుండన్నోపు. ఆతనికిఁగలిగిన దికుమార్తెయే యనియు నీతఁడెవ్వఁడో వారి బంధుగులయొక్క బిడ్డఁడనియుఁ బుత్రసంతతి లేకపోవుటచే వీనిని వారియొద్దనే యుంచి పెంచుకొను చున్నారనియుఁ జాలమంది చెప్పుకొను చుందురు. వీని ధైర్యసాహసాధిక్యములను బట్టిచూచినను నట్లే చెప్పక తప్పదు. — కాని తరువాతనేమిజరిగెను ?

రెండవ — మాధవవర్మ తనమనుమని శౌర్యధైర్యాతిశయముల కాశ్చర్యపడి యపరిమితానందమున నాతనిని దనసర్వసైన్యమునకధిపతిఁజేసెను.

మొదటి — బాగు. బాగు. నిక్కముగా నాతఁడాపదవికిఁ దగినవాఁడే. ఈకుబ్జవానిని వీరసింహుఁడు రణముఖంబున నెదిరించినను జయమొందుట సందియంబు.

రెండవ — ఓయీ ! ఇంకొకమాట! ఈకుబ్జవాఁడుజన్మించిన తరువాత వీనితండ్రియొక్కసారియైననువచ్చి చూచియుండ లేదేమి ?

మొదటి — పిచ్చివాఁడా ! యుద్ధరంగమే యిల్లుగాఁగల వీనికి భార్యాపుత్త్రులేమిటి? వానియాయుధములే వానిసంతానములు.

రెండవ — ఎంతశస్త్రజీవులైనను సంగ్రామరంగమే నిజమందిరంబుగా నున్నను గడుపారఁగన్న వీరపుత్త్రునిజూచు కుతూహలముగల్గని వారుందురా ! వేఱద్దియేని కారణంబుండవలయును.

మొదటి — కారణములేకేమి ? త్రిలింగరాష్ట్రములకును మాగధేయులకును సంధియగుటచేఁ బరస్పరవైరంబులు సమసి త్రిలింగదేశమెల్ల శాంతియుతము గావించి యనవ్రతుఁడై యున్న తండ్రికడకేగిన కొలఁదిదినంబులకే తండ్రి స్వర్గస్థుఁడయ్యెను. ఆతఁడా చింతలో మునిఁగియుండఁగాఁ బూర్వము తన స్వాతంత్ర్యమును దేశమును గోల్పోయిన మాళవపతి యొకచెంతను యవనులొకచెంతను బాండ్యకేరళ మహీపతులొకవంకను దండెత్తి యొకరివెనుక నొకరు వచ్చుచుండుటచే సమరకల్లోలనిమగ్నుఁడై యుండుటచే నాతనికిందు రావలనుపడినదికాదు కాఁబోలు. లోకైకవీరుఁడగు వీరసింహుఁడు దనరాష్ట్రముపై దండెత్తివచ్చిన వారలనందఱిని జయించుటయేకాక విజయయాత్రయను నెపంబున నుత్తరరాజ్యంబులకెల్లఁ బోవుచున్నాఁడని కూడవింటిని.

రెండవ — అవునదియు నమ్మఁదగినదియే.

మొదటి — మాటలలోఁ గాలము చాలఁగడచిపోయినట్లున్నది త్వరగాఁ బోవలసిన పనులున్నవి. పోయివచ్చెద.

రెండవ — అటులనే పోవుదము. పదపద. (నిష్క్రమింతురు)

[ ఇదిప్రవేశకము ]

[ ప్రతాపసింహుఁడును — వసంతుఁడును బ్రవేశింతురు. ]

వసంతుఁడు — ప్రతాపసింహా ! సర్వసైన్యాధిపత్యమును వహించినంతమాత్రముననే లేదు. వీరసింహునకుందగినవాఁడవను పేరుం దెచ్చుకొనవలయును.

ప్రతాప — వసంతా ! నీవును సిగ్గులేక వైరిపక్షావలంబినంతగా స్తుతించెదవేల ? మున్ననేకపర్యాయములు వందిమాగధులచే వాని విజయాంకగేయముల విని దండతాడిత భుజంగంబు భంగి

మంది పడుచుండెదువాఁడను ఎట్టివానికేని పరప్రక్షగంబు లతి దుస్సహంబులుగదా! ఒకవీరసింహుఁడేకాదు. అట్టివీర సింహులు పదివేలమంది వచ్చినను నోకచీరికింగొనను. నాటం గోలె వానినెప్పుడు జయింతునాయని నామనంబు తత్తఱపడు చున్నది.

వసంత — (ఆశ్చర్యమునఁ దనలో) ఈతని మాటలంబట్టిచూడ వీరసింహుఁడు తనతండ్రియన్న సంగతి నితఁడుగూడ నెఱుంగ నట్లున్నది ఏకారణంబుచే వీనితల్లి యీవృత్తాంతమును రహ స్యముగా నుంచినదో! కానిమ్ము (ప్రకాశముగా) మిత్రమా! తొందరవలదు. వీరసింహునకుఁ జాలవని నాతలంపు గాదు. కాని యాతని సాహసపరాక్రమము లద్వితీయములు. మున్నొకతఱి మగధసైన్యంబుల నాయితంబు గావించుకొని యాంధ్రరాష్ట్రంబుపై నాకస్మికముగా దాడివెడలితిమి. అంత వీరసింహుఁడు సహజసాహసంబు వ్యక్తీకరింప శత్రులోకం బుపైఁ బిడుగువాలెఁబడి విద్యుల్లీలమెఱయుచున్న ఖడ్గధారలచే శాత్రవగాత్రవిచ్ఛేదంబుఁ గావించి తద్రక్తసిక్తాసిని గౌతమీ పుణ్యజలంబులఁ గడిగెను. నాఁటిరూపంబుఁదలంచికొనిన నేఁటి కైన నాగుండెలు జలదరించుచున్నవి.

ప్రతాప — వసంతా! నీవెంతగాఁ జెప్పినను వినకతిరిగి వానిని నాముందరఁ బొగడుచున్నాఁడవు. పిఱికిపందవగు నీకాతని రూపుగాంచినంతనే గుండెలదురునేమో కాని నాకెట్టిభయ మును లేదు. ఏమెడఁజూచినను గర్ణశూలాయమానంబులగు నాతని ప్రశంసావాక్యములే వినఁబడుచున్నవి. నేనిఁక విన నొల్ల. క్రియారూపంబుననే మాబలాబలంబులు కొలఁదికాల మున నీకెఱుఁగఁజేసెదను.

వసంత — (తనలో) మిడిమిడియుచున్నదే! ఇఁక వీనిచిత్తమును మరల్పవలయు (ప్రకాశముగా) మిత్రమా! కోపగించుకొన

కము. నీకున్న దేశాభిమానము నాకుమాత్రము లేదా ? నీకుం దగు ప్రోత్సాహముగల్గుటకే నిట్లంటిని. పోనిమ్ము. ఇదిగో ! ఒకమాట!

ప్రతాప — ఏమి ?

వసంత — ఎన్ని సంవత్సరములనుండియో చూడవలెననుకొన్నను నీతండ్రి యొకనాఁడైనను గనఁబడఁడేల ?

ప్రతాప — మిత్రమా ! నేనెప్పుడును నాతనిజూచి యుండ లేదు. అప్పుడప్పుడు మాతల్లినడిగినను నేఁడువచ్చును రేపువచ్చున నుచుఁ జెప్పుచుండెడిది.

వసంత — ఆతనిపేరును నాతఁడెందుండునదియైన నెఱుంగుదువా ?

ప్రతాప — ఆతఁడెక్కడనో యుద్ధమొనర్చుట కరిగెననియు నాత నిపేరు వీరాగ్రేసరుఁడని మాత్రముచెప్పెను.

వసంత — అటులనా. నేఁడు తిరిగినీజనని కడకరిగి నీజనకుని గూర్చి నిజము దాఁపక చెప్పుమనుము. దానశుభ సంధాయక మగు నూతనవృత్తాంతము నెఱింగెదవు.

ప్రతాప — అట్లే ! నేఁడు మాతల్లినడిగి తెలిసికొనియెద.

[ సేవకుఁడుప్రవేశించును ]

సేవకుఁడు — అయ్యా ! మీతాతగారు మిమ్మునొకసారి రమ్మని చెప్పినారు.

ప్రతాప — మిత్రమా ! తిరిగి రేపు కలిసికొందము ( సేవకు నితో ) ఓరీ మాతల్లి గారడిగినచోఁ దాతగారివద్దకు వెళ్లితి నని చెప్పుము.

[ మిత్రులిద్దఱును నిష్క్రమింతురు ]

సేవ — దేవిగారికీ సమాచారమునివేదించెదను. ( అని ముందునకు నడిచి ) దేవిగారిటకే వచ్చుచున్నారు.

[ దేవిప్రవేశించును ]

మోహి — ఓరీ! కుమారుఁడెక్కడ?

సేవకుఁడు — అమ్మా! తాతగారేలకో కబురుపంపఁగా నిప్పుడే వెళ్ళినారు.

మోహి — మంచిది! మాటాడినవెనుక నిటురమ్మనుము. పొమ్ము.
(సేవకుఁడు వెడలును) ఈతఁడెందులకుఁ బిలిచియుండును.

చం॥ గడువు గతించిపోయెఁ జిర ♦ కాలముక్రిందనె ఘోడశాబ్దముల్
గడచెను నన్నుఁబాసి కనఁ ♦ గల్గెడు భాగ్యమిఁకెన్నఁడబ్బునో?
యుడుగనిచింతయాఁబతివి ♦ యోగముస్త్రీలకు రామరామ!యీ
పుడమిని నాఁడుపుట్టువునఁ ♦ బుట్టుటకన్నను బాపమున్నదే?॥

నన్నుబాసినదాది నేఁటివఱకొకసారియైన వచ్చిచూడఁడుస రిగదా తనక్షేమసమాచారమునైనఁ దెలిపియుండఁడయ్యె. భార్య యనునది యొకతె యున్నదనుసంగతికూడ నాతనికి జ్ఞాపకమున్న దోలేదో! ఉండినచో నర్ధాంగినగు నన్నుజూచు కోర్కెయైన నుండదా? అచిరకాలంబుననే నిన్నుగలిసికొందునని చెప్పి యింతడ నుకరాఁడయ్యెనే. ఏదేశంబున నేవిధంబుననున్నదియుఁ గూడఁ దెలియదయ్యె. ప్రతాపుఁడు తనతండ్రి యింకరాఁడేమనియడిగిన పుడెల్ల దుఃఖము నణఁచిపెట్టుకొని యిదిగోయిదిగోయని యింకెన్ని దినములు గడపఁగల్గుదును.

చం॥ పతిరణభూమికిన్ జనిన ♦ భర్తృవియోగ సముద్రమందు సం
తతము మునింగి యేనుసురు ♦ దాల్చితి నెట్టులో యింతదాఁక నీ
సుతుఁడను నావఁజూచుకొని ♦ చోద్యమహా! విధికృత్యమెన్న నీ
గతినిదరింప నీయసమ ♦ కష్టమెనో? యపంపఁదలంచియుండెనో? ॥

అయ్యో! మాతండ్రియింకను కుత్సితబుద్ధివదలలేదుగదా! కుమారాస్త్రవిద్యాప్రదర్శనమను పేరుపెట్టి పసికుఱ్ఱవానికి సర్వసై న్యాధిపత్యమొసంగి యాంధ్రదేశంబుపై దాడివెడల నాతనిఁ బుర్రి

కొల్పుచున్నాఁడఁట. ఇట్లు బుచ్చుటయుం జూతనిదురుద్దేశము గూడఁ జూచాయగాఁ దెలియవచ్చినది. క్షత్త్రియ పుత్త్రుఁడగు వాఁడు రిపులఁబరిమార్చఁ బోవుట ధర్మము గాని యింటికిప్రైఁ గత్తి గట్టుటధర్మము ఇంజేరికి ముప్పవాటిల్లినను దుఃఖము నాకేకదా! ప్రతాపసింహుఁడు గెల్చిన రాజ్యము దనకగుననియు నొకవేళ మడిసినను గుమారునిగా నెఱింగి వీరసింహుఁడింక జీవింపఁజాలఁడనియుఁ దదుపరి రాజ్యమేవిధంబుననైనఁ దనవశంబు గాఁగలదనియు నూహించుచున్నాఁడఁట. హా! రాజ్యకాంక్ష యెట్టి దుష్కృత్యములనైనఁ జేయించుసుగదా! కావున నాశక్తికొలఁది బోధించి నిరుత్సాహిం జేసి వీనియుద్ధప్రయత్నము మాన్పెద.

[ ప్రతాపసింహుఁడు ప్రవేశించును ]

ప్రతాప — తల్లీ! నమస్కారము.

మోహి — కుమారా! దీర్ఘాయువు కలుగుఁగాక.

ప్రతాప — తల్లీ! ఏలనీమోమిట్లు చెన్నుదరిగియున్నది?

మోహి — కుమార! ఏమియును లేదు. శరీరమందలి యస్వస్థతచే నట్లు కాన్పించుచున్నాను గాఁబోలును.

ప్రతాప — అమ్మా! యేలకో ప్రతివిషయమును నాకు మఱుఁగుఁజేయుచుందువు. కారణమేమి? అదియునుఁగాక నేనునిన్నొకప్రశ్న మడుగవచ్చితిని.

మోహి — నాయనా! ఏమిటది.

ప్రతాప — నాజనకుఁడెవ్వఁడని మున్నెన్నిసారులడిగినను మాటదప్పించి నాప్రశ్నమునకుందగు ప్రత్యుత్తరంబొసంగకయే పంపుచువచ్చిన నూరకుంటిని. కాని

తే॥ గీ॥ ఎవని గర్భంబునం దుద ♦ యించి తంచుఁ
జెల్మికాండ్రెల్ల నన్ను బ్ర ♦ శ్నించిరేని

మస్తకమువంచి నోటను ♦ మాటలేక
యేమి ప్రత్యుత్తరము వారి ♦ కిత్తునమ్మ ॥

నేఁడెట్టులైన నీవు నాకావివరముఁ జెప్పినంగాని విడువను.

మోహి — పుత్త్రా! పికెందుల పంతము.

ప్రతాప — తల్లీ! ఇందు పంత మేమున్నది? తన తండ్రియె వ్వఁడో తెలిసికొనుటకూడ పంతమా! జన్మస్థైత్యముంబట్టి పురుషుల బలాబలంబు లేర్పడుచుండునుగదా?

మోహి — తండ్రీ! దుర్లభుండగు నిజజనకునిగూర్చి యేమిచెప్ప దునోయి.

ప్రతాప — ఏమిచెప్పుదువ! వినుము

కం॥ నను గన్నతండ్రియెవ్వరో?
మనుదేశం బెందుఁగలదో? ♦ మానితచర్యల్
పొనరించినట్టి వేవియొ?
జననీవే తెల్పు మతని ♦ సద్గుణ చయముల్ ॥

మోహి — తే॥ గీ॥ తనయ! మగధాధిపతి నీదు ♦ జనకువైరి
వైరిసుతుఁడవు నీవంచు ♦ వాఁడెఱుంగఁ
బ్రాణహానియె కానఁ ప్ర ♦ ఖ్యాతి దగని
దగుట నీజన్మమతి రహ ♦ స్యంబు తనయ ॥

ప్రతాప — తల్లీ! ప్రాణాపాయము మాటటుంచుము. అయి నను నీవనునట్లు నావృత్తాంతము వైరులెఱింగిన ముప్పువాటి ల్లునన నగునేమోకాని నేనెఱింగిననేమి? పైననేనెఱుంగకున్న యెడనే ముప్పు వాటిల్లునేమో! కాన దాఁచిపుచ్చక సర్వ మును దెలుపుము.

మోహి — అట్లయిన నీజన్మవృత్తాంత మొరులకుఁ దెలియనీయనని వచోఁ జెప్పెదను.

ప్రతాప — తల్లీ! యిట్టిపిఱికిమాటలు చాలింపుము. విధిప్రాఁత యేరికినిదాఁటఁదరంబుగాదు. నాహృదయాంతరాళమునఁ బ్రజ్వ

లించుచున్న యశఃకాంక్ష నడంపఁజాలునదెద్ది? దాఁగనేరని రహస్యంబును దాఁపనేల? నావంశమన్న నా కభిమానము గాదా! నావంశమునకుం దగినవాఁడనని లోకమున కెఱుకఁ జేయవలదా

మోహి — నాయనా! అన్నని వినుము.

సీ॥ కలువ రేకులఁబోలు ♦ కన్గవగలవాఁడు
తరళకాంతుల ఫాల ♦ తలము వాఁడు
చంద్ర బింబమువోలు ♦ సొరుగన్గొన వాఁడు
చండమార్తాండ తే ♦ జంబు వాఁడు
ఆజానులంబిత ♦ హస్తద్వయము వాఁడు
క్ష్మాధరతుల్య వ ♦ క్షంబు వాఁడు
శత్రుకోటికి గుండె ♦ జలదరింపఁగఁ జేయు
వీరతాయెతులతో ♦ వెలయు వాఁడు

గీ॥ హరిహరాజులు ముగురేక ♦ మూడురన్న
దురమునందుఁ జలింపని ♦ దోర్బలుండు
నాయతభుజుండు లోక వి ♦ ఖ్యాతయశుఁడు
కన్నతండ్రి! నిన్గడుపారఁ ♦ గన్నతండ్రి॥

చం॥ కనకశిరస్త్రమందు వెలి ♦ గ్రక్కెడు కాంతుల మేల్తురాయితోఁ
గనదురు విస్ఫులింగములు ♦ గ్రాలుకసుంగవతో శితాసితోఁ
ననిలసమాన గామియగు ♦ నశ్వముతోఁ జనునీపితన్జనుల్
వినయముతోడ మ్రొక్కెదరు ♦ వీరరసాకృతిఁ దాల్చెనోయనన్॥

ప్రతాప — సత్యము! సత్యము!

ఉ॥ భూతలమం దధర్మములు ♦ పుట్టెడుపట్టున ధర్మరక్షకై
జాతమునొందుచుందురు వి ♦ శాలమనస్కులు సర్వలోక వి
ఖ్యాతులు మాతృదేశ సహ ♦ కారులు వీరుఁలు దేవతాంశసం
భూతులుగాన సర్వజన ♦ పూజితులన్నను జోద్యమున్నదే॥

**మోహిని** — కుమారా! వినుము!

**ఉ॥** కోపముగల్గెనేని రిపు ♦ కోటి సహస్రము వచ్చెఁగాక సం
తాప భయంబులన్ గనఁడు ♦ దర్పితవైరిమొకాని సత్కృపన్
జూపుమటంచు వేడినఁ ద ♦ నూభవు నట్లులఁబోృచుయుద్ధ వి
ద్యాపరతంత్రధార్మిక వ ♦ రెంనూఁటు నీజనకుండుపుత్త్రకా॥

**మ॥** జలజాతాంచిత వాఎనాంబువులఁ గృ ♦ ష్ణాగౌతమీవాహినీ
చలదుత్తుంగ తరంగమాలికల స ♦ న్యశ్యామలంబౌచుదో
ర్బలసంపన్నులఁపుత్త్రులైనరునాం ♦ ధ్రపాజ్యసామ్రాజ్యమం
దలర్గారున్ వినుమొక్కపట్టణము క ♦ ల్యాణాభిధానంబునన్ ॥

సీ॥ తనభుజ ప్రావీణ్య ♦ మునఁ బాండ్య కేరళ
నృపతులసామంత ♦ నృపులఁజేసి
తనబాహుపరిఘచే ♦ తనుమాళ్వమగధసై
న్యములజయించి వె ♦ న్నాటితఱిమి
తనపరాక్రమముచే ♦ దర్పాఢ్యుఁడైనట్టి
కొంకణాధీశుని ♦ బింకమడఁచి
తన ప్రతాపముననే ♦ తాతయౌ మాధవ
వర్మనోడించి క ♦ ప్పంబుగొనుచు

తే॥ స్వభుజబలమున నాంధ్రరా ♦ జ్యంబునిలిపి
పేరుగాంచిన జగజెట్టి ♦ వీరసింహుఁ
డనఁగ నెవ్వాఁడు గలఁడో క ♦ ల్యాణపురిని
నతఁడె నినుఁగన్నతండ్రి ర ♦ హస్యమేల ॥

**ప్రతాపు** — (ఆశ్చర్యమున) తల్లీ! వందిమాగధజనంబులచే నిత్యసంస్తుత్యుండగు వీరసింహుఁడా నాతండ్రి!

**మోహి** — అవును నాయనా!

**ప్రతాప** — అతఁడు మన ప్రతిపక్షిగదా. నాతండ్రియెట్లయ్యె?

మోహిని — మున్నొకసారి తనహయంబును గోలుపోయి తదన్వే షణార్థమీ పురంబునకరిగి నన్నువెూహించి మీతాతయనుమ తంబున నన్ను బరిణయమాడెను.

ప్రతాప — వైరయని యెంచక మాతాత నిన్నయ్య కిచ్చ నిచ్చగించెనా?

మోహిని — ఇయ్యకేమిచేయును? మహాతేజస్సంపన్నుఁడగువాని కెదురాడఁగలఁడా! లదియునుంగాక తానొకటి దలఁచిన దైవ మొకటి తలఁచినట్లు నన్నాలిగఁ జేకొన్న నాతఁడు తనపక్షమునకు వచ్చునని తలఁచెను. పవిత్రాదర్శములుగల మహానుభావులు దేశద్రోహంబున కిచ్చగింతురా!

ప్రతాప — ఆహా! ధన్యాత్ముఁడను అట్టిమహాపరాక్రమశాలికిఁ బుత్త్రుఁడనగుటకన్న భాగ్యమేమి? (సంతోషమునఁ దనలో) తండ్రీ! విరోధభావమునకైన నిన్నే సదా స్మరించుచుండెడి వాఁడను. కన్నుమూసిన నీవే కాన్పించుచుండువాఁడవు. కర్ణ పుటంబుల నిన్నుగూర్చిన స్తోత్రములే వినిపించుచుండునయ్యె. అవన్నియుఁ దొల్లివైమనస్యముతో గ్రహించుచు నిన్నే యా దర్శపురుషునిగా మనంబున నెంచి నిన్నెప్పుడు జయింతునాయని యువ్విళ్లూరుచుండువాఁడను. అట్టినిన్నే యిప్పుడు నాతండ్రి నిగా నెఱింగి సంతోషమున నిన్నుగూర్చి వినుచుంటిని. ధ న్యాత్ములగువారి నేవిధంబున స్మరించినను బాపంబు లంతరిం చునుగదా! (ప్రకాశముగా) ఈనాఁడు నాతండ్రియని నాకెవ్వ డును జెప్పవైతివేమమ్మ. ఆతఁడిందురాకుండుటకుఁ గారణమే మైనంగలదా?

మోహిని — ఏమియునులేదు. మాగధేయు లాంధ్రరాష్ట్రంబు పై దాడివెడలిరనియు దాని నివారించుటకై తానుబోయి యుచి రకాలంబున వత్తుననియుఁ జెప్పియుండెను.

ప్రతాప — తదుపరి

మోహిని — మాగ ధేయులోటువడుదుమని భీతిని సంధిచేసికొని రట. తరువాత నవనానస్థితియందున్న మీపితామహులనిజా చుటకై నీజనకుఁడు నిజపురంబునకరుగఁ గొలఁది కాలంబున కాయనగతించెను. తరువాత మున్నుతమ రాజ్యభాగములను స్వాతంత్ర్యములను గోల్పడిన మాళవపతియొక చెంతను బాండ్య కేరళాధిపతు లొకచెంతను నిరంతరము దండెత్తి వచ్చుచుండు టచే సమరకల్లోల నిమగ్నుఁడై యుండుటచే రావలసుపడినది కాదు. తరువాతఁ దనరాజ్యముపైకి దండెత్తి వచ్చినవారల జయించి పారఁదోలుటయే కాక విజయయాత్ర గావించుచు నుత్తరదేశంబులఁ దిరుగుచున్నాఁడని వింటిని.

ప్రతాప — తల్లీ! నీవైన నచటికేలపోవైతివి?

మోహి — మీతాత నన్నిచ్చి పరిణయము చేయుటకుముందు మీతండ్రియొద్దనుండి యొకవాగ్దానమును గొనెను.

ప్రతాప — ఏమది?

మోహి — మీతాతయొక్క జీవితాంతమువఱకు నన్నిచ్చటనుం డనీవలయునని.

ప్రతాప — అటులనా?

మోహి — అవును. అందుచేతనే నేనే యచటికిఁ బోవుటగాని నన్నాతఁడు గొనిపోవుటకాని జరుగ దయ్యెను. మఱియుఁ బ్రస్తుతముమాత్ర మతఁడు విజయయాత్రాభిలాషమై దేశాటన మొనర్చుచున్నట్లు వింటిని ఈయెడఁబాటే నాచింతకుంగల కారణము.

ప్రతాప — ఇప్లోని యాతఁడిప్పుడెక్కడనుండునదియుఁ దెలియునా!

మోహి — తెలియదు. తెలిసిన నేమిచేసెదవు?

ప్రతాప — తల్లీ!

మ॥ సమరోర్వీస్థలి నిల్చి బాహుబల తే ♦ జస్స్ఫూర్తి దీపింపఁ జ
య్యముగాఁ బోర్చెదు నన్నుఁజూచిపిత యు ♦ త్యంతాద్భుతానందభా

త్తమునఁ బోజనసల్పుచుండ నిజవృ ♦ త్తాంతంబెఱింగింతు లో
కములోనుత్తమ పుత్త్రిదర్శనము సౌ ♦ ఖ్యంబీయదే? తండ్రికిఁ॥
మఱియు,

ఆ॥ వె॥ జనకు నంకపీఠ ♦ మునఁజేరు భాగ్యంబు
గలుగునేయని మదిఁ ♦ దలఁచుచుందు
నిట్టి భాగ్యమబ్బ ♦ నింకేమికావలెఁ
దల్లి! పోదునమ్మ ♦ తండ్రికొఱకు ॥

మోహిని — నీజనకుని నేవిధంబునదర్శింతువు? ఎందుండునని పోదువు?

ప్రతాప — జననీ! నేనును విజయయాత్రఁగావించుచు నార్యావర్త మునంగల సకలరాష్ట్రంబులకేగి యందున్న వీరవరులనెల్ల జయించుచుఁబోవుచుండ నాప్రఖ్యాతినివిని నాజనకుండెందేని నన్నుదారసిలకమానఁడు. అంతట ముందుగా నాజన్మవృత్తాంత మాతని కెఱుకపడనీయక నాపరాక్రమంబెల్లఁజూపించి యాతని వశీకృతుఁ గావించుకొందును. అన్యులెట్టివారువచ్చినను క్షణంబున యమసదనంబున కనిపెదను. కావున వేఱుగాఁ దలంపక జైత్రయాత్రకై వెడల నీసుతునకనుజ్ఞయిమ్ము.

మోహిని — కుమారా! తండ్రిని గనుఁగొనుట కింతకన్న వేఱు మార్గములు లేవా? ప్రాణాపాయకరంబగు నీయుకారణయుద్ధమేల?

ప్రతాప — వీరులకు యుద్ధరంగమే నాట్యరంగముగదా. కానఁ బ్రాణభయంబునకై జంకనేమిటికి?

తే॥ గీ॥ దేహమెవ్వారికేని య ♦ స్థిరమటంచుఁ
దెలిసియుండియు మృతికినై ♦ దిగులుపడెడు
పిఱికివారలకెట్లు ల ♦ భించుఁజెపుమ!
యవనిఁద్రైలోక్యవర్తిని ♦ యైనకీర్తి ॥

మఱియు

తే॥ గీ॥ నిఖిలభూపాల సంస్తవ ♦ నీయమగుచు
రణముఖంబునఁ జావని ♦ రాచవాని
జవమదియేల ! ధరనెన్ని ♦ జీవకోట్లు
కాలగతులందవే ? మాఱు ♦ మూలలందు ॥

మోహిని — ( చెవులుమూసికొని ) శివ ! శివా ! అమంగళంబు తొలంగుఁగాక. నాయనా ! ఏలయిట్టి యపభ్రంశపుమాట లాడెదవు ? గోటంజీఱఁగలపనికి గొడ్డలియెందులకోయి ?

ప్రతాప — క్షత్త్రియుండగువాఁడు తన బాహుబలపరాక్రమంబులచేఁ దనను వెల్లడించుకొనునేకాని యాచకునివలెఁబోయి తన నెఱిఁగించుకొన నిచ్ఛగించునా ? మఱియు దీన నావిజయయాత్రాభిలాషయును దీఱఁగలదుగదా !

మోహిని — ముక్కుపచ్చియారని పసిబాలుండవు. రణరంగమున నేమిగాఁ దలంచుచుంటివోకాని యందలి యపాయంబు నారయకుంటివి. ఇదివఱ కేయుద్ధములం జొరితీరితివని నీకీజైత్రయాత్ర ! నీవేడ ? జైత్రయాత్రయేడ ? కావునఁదండ్రీ ! నా మాటవిని యూరకుండుము.

ప్రతాప — తల్లీ ! ఏలనీకింత వెఱ్ఱి !

గీ॥ ఖడ్గహస్తుండనగుచు సం ♦ గ్రామమందు
నిలుచుమాత్రన నెదిరింపఁ ♦ గలఁడెవండు
హరియు హరుఁడును బ్రహ్మదు ♦ లైనఁగాని
భయపడనుజుమ్మి నీకింత ♦ భయమదేల ? ॥

మోహి — కుమారా ! కొలఁదికాల మోపికపట్టుము. నిన్నని కిఁబంపుటయన్న నాయొడలు వడంకుచున్నయది. నామాట వినుము. నిక్కముగా నీవంతవాఁడవైనను బసిబాలుండవు. కానఁ గయ్యంబు వలదు.

ప్రతాప — తల్లీ !

ఉ॥ రాచకొలంబునన్ బొడమి ♦ రాజశిఖామణి చెట్టఁబట్టియున్
రాచమెకంపు బల్కొదమ ♦ నాఁబడు నన్గను వీరమాతవై
రాచగొనంబుమాని సమ ♦ రంబనినన్ భయమందియిట్లువై .
శోచితవాక్యముల్ వలుక ♦ నుర్విజనంబులు నవ్వకుందురే॥

మోహి — పుత్రా ! (వజ్జకై పెనఁగులాడుచు వయోబలతార తమ్యంబు లెఱుంగక పరకీయ స్వకీయాంతరంబుల గుర్తింపక స్వేచ్ఛావిహారంబు సల్పుట ఖగోత్యంబు ఖద్యోతమండలం బరికట్టుటవంటిది.. నిష్కారణముగా శాత్రవదీప కళికల కేల శలభాయమానుండ వయ్యెదవు ?

ప్రతాప — తల్లీ ! ఏలనన్నిట్లు నిరుత్సాహింజేసెదవు ?

చం॥ అనిమొననిల్చి శాత్రవుల ♦ నాహుతిగానిడ యుద్ధభూమికిన్
జనఁదగుఁగాక లేనియెడ ♦ శత్రువుచేతను జచ్చిపోవఁ జె
ల్లును ద్వివిధంబుఁగాక భువి ♦ లోపలఁ బ్రాణముగల్గు పీనుఁగై
మనిన ఫలంబె ? యీపిఱికి ♦ మందులు వోసెదవేల ? చేలవై ॥

తల్లీ !

చం॥ భుజబల విక్రమోగ్రుఁడగు ♦ పుత్త్రునిశక్తి నెఱుంగ కిట్టులన్
గజగజ లాడెదీవు కద ♦ నంబనినన్ జననీ ! మహాగజ
వ్రజములఁ జీల్పఁజాలు మృగ ♦ రాజు వనాటములైన జంబుక
వ్రజములఁ గాంచి భీతిలునె ? ♦ ప్రాణము మానముకన్న నెక్కుడే॥

అమ్మా వీరమాతవగు నీవేనాకిట్టి బోధలొనర్చుచుండ నితరభారత నారీమణులంగూర్చి యేమిచెప్పవలయును ? తల్లీ ! నిన్న నరాదుగాని నీబోధలు భారతమాతకును హైందవ స్త్రీలోకంబునకును గూడ మచ్చ దెచ్చుచున్నవి.

సీ॥ ఉగ్గుఁబాలనుజేర్చి ♦ యురుతరోదార ధై
ర్యంబుల నూరిపో ♦ యంగ వలదె ?
పిఱికి పిశాచంబు ♦ వెడలి పోవుతమంచు

నెమ్మిమై దేహాన ♦ నిముర వలదె ?
స్వాతంత్ర్యవాయు సం ♦ చారంబుచేయించి
దాస్యరోగముఁ బారఁ ♦ దఱుమవలదె ?
స్వమత ధర్మంబను ♦ పాదంబు దినిపించి
దేశభక్తునిగాఁగఁ ♦ ద్రిప్పవలదె
గీ॥ ఇట్లు సద్గ్రాహ్య సూక్తు లు ♦ ద్దీంద్రియమున
నాగరకతాం కురంబుల ♦ నాటఁగల్గు
తల్లి, తల్లిమొకాని యి ♦ తర సతులకుఁ
దల్లిశబ్దం బదేరీతిఁ ♦ జెల్లునమ్మ ! ॥

పిరికివారలగు కుమారు లున్నచో క్షత్త్రియు లగువారు శౌర్యసాహసంబులు పుట్టునట్లు హితబోధ యొనర్చి రణరంగమున కంపుట్ల ప్రశంసనీయముగాని సహజబలతేజో విరాజితులగు శౌర్య ధనులకుఁగూడఁ బిఱికితనంబును గఱపుట సిగ్గుపాటు. చేతగాజు లుదాల్చి యింటఁగూర్చుండుటకే నాఁడుపుట్టువునఁ బుట్టలేదుగదా? ఆంధ్రదేశమునం దాఁడువారుసైతము కత్తిగట్టి యుద్ధంబునకు దిగుట కలదని మున్నొకసారి నాతోడఁ జెప్పియుంటివి గదా ! అంతమాత్రపుఁ బౌరుషములేని నాపురుషత్వమేల !

మోహి — కుమారా ! సములగు ప్రత్యర్థులతోడ యుద్ధంబు సేయ సమకట్టఁ జెల్లుంగాని గొప్పవారితోడి పోరాటము కుత్త్రి తనపుఁ జేష్ట. అయ్యది ప్రాణాపాయకరము. కానఁ గొలఁ దికాల మోర్చియుండుమంటిని గాని నిన్ను నిరుత్సాహిఁజేసి పిఱికితనంబుఁ గఱపవలయుననికాదు. క్షత్త్రియమాతల కిది కానిగుణంబనియు నేనెఱుంగుదు.

ప్రతాప — తల్లీ ! కేసరి కిశోరంబు గంధగజేంద్రములపై దుము కునేకాని హీన సత్త్వములపైకిఁ బోవదు. అదియుఁ గాక కొలఁదికాల మోర్చిననేమి ? నానెత్తిగీతలు దప్పునా ? ఒక్క మాటవినుము !

తే॥ జీవితంబులు మనకు సు ♦ స్థిరము లంచు
వింతరీతుల నిర్మింప ♦ నెంతుమిలను
గాని దైవము పూర్ణవి ♦ జ్ఞానియగుట
నాఁ డినేకూర్చె మనదు ని ♦ ర్యాణవిధము ॥

కావున మాఱువలుకక నాయీప్సితంబు నెఱవేర్పవేఁడెద. మఱియు వీరాగ్రేసరుండగు మజ్జనకుని గుణగణంబు లెఱిఁగించిన కొలంది రక్తనాళములన్నియు రుధిరపూరితములై దేహమెల్లఁ బులకరింపఁజొచ్చెను. అట్టివానితో నెదిరిపోరువారెంత ధన్యాత్ములు? దైవవశంబున నేనే జయించితినేని తండ్రికన్న గొప్పకీర్తి నార్జింపఁ గల్గినవాఁడనగుదును. ఒకవేళ తండ్రిచేఁ జచ్చితినేని జీవితాంతమునకైన నాతనిఁజూచుభాగ్యము లభించినదని సంతసింతును. ఎవ్విధంబైనను నాకు సంతోషదాయకమే. కనుక నన్నుఁ బోనిమ్ము.

మోహిని — ముద్దుకుఱ్ఱా! యెంతగాఁజెప్పినను వినక యేలయిట్లు మొరటుపట్టు పట్టెదవు?

సీ॥ ఊరివారలువచ్చి ♦ గారాబమునసిన్ను
ముద్దాడఁగాంచినే ♦ మురియుచుంటఁ
దోడివారలఁగూడి ♦ యాడుచుండెడినిన్ను
గనులపండువుగాఁగఁ ♦ గాంచుచుంట
నీపరితాపముల వ ♦ ర్ణించుచుండుటఁగాంచి
వీనులవిందు గా ♦ వించుకొంట
నీముద్దుపల్కుల ♦ నిరతంబువినుచుండి
హర్షాబ్ధిలో నోల ♦ లాడుచుంటఁ

గీ॥ బతివియోగంపు దుర్భరా ♦ పత్తమంబు
మాయఁజేసె నీముఖచంద్ర ♦ మండలంబు
మగుడి దుఃఖాంధకార ని ♦ మగ్నఁగాఁగఁ
జేసి చంపక నన్ను ర ♦ క్షింపుమన్న ॥

నీతండ్రి రణంబున కేగినదాది దుఃఖాంబుధి మునింగి నిద్రాహారంబులన్మాని దివారాత్రింబులం గడపుచు నిన్నుజూచుకొని ప్రాణంబుల నింతవఱకు నిల్పఁగల్గితిని. నీవుకూడ నీతండ్రివలెనే నన్నొంటరిదానింజేసి రణంబున కేగితివేని నేను బరలోకంబున కేగ సంసిద్ధురాలనై యున్నాను. కాన నాబ్రతుకిచ్ఛగించితివేని నీప్రయత్నముమానుము. లేదేని నాప్రయత్నమున నేనుందును.

ప్రతాప — అమ్మా ! నన్నెంత బెదరించినను నాప్రాణమైన విడుతునుగాని నాప్రయత్నమునువిడువఁజాల. కాన నీకనైన నన్ను నిర్బంధపెట్టక పోనిమ్ము.

సీ॥ జగదేకవీరునా ♦ జనకుఁ గానక యింక
నిమిషకాలంబేని ♦ నిలువఁగలనె ?
సాహసకుధగమా ♦ జనకుఁగానక యింక
శిరమెత్తి జగతిపైఁ ♦ దిరుగఁగలనె ?
పురుషసింహంబుగాఁ ♦ బొగడొందుజనకుని
బలుకరింపక నేను ♦ బ్రతుకఁగలనె ?
కడుపారఁగాంచిన ♦ కన్నతండ్రినిజూచు
నుత్సాహమును జెంద ♦ నుండఁగలనె ?
గీ॥ జనని ! నన్నింతగా నిరు ♦ త్సాహిఁజేయఁ
దగనిపనియమ్మ ! క్షాత్త్రంబు ♦ దాల్పుమమ్మ !
యనికిఁజొరనిమ్ము మాయయ్య ♦ నరయనిమ్ము
ఘనతఁగననిమ్ము పుణ్యమ్ము ♦ గట్టుకొమ్ము ॥
(అని నమస్కరించును.)

మోహిని — తండ్రీ ! నిన్నుఁగూడ విడనాడి యీప్రాణంబుల నెట్టుల నిల్పుదునోయి !

ప్రతాప — తల్లీ ! కొలఁదిమాసంబులలో విజయయాత్రయొనర్చి రిపుమద కుంభికుంభములఁజీల్చి యఖండవైభవంబున మగుడి వచ్చునన్నుఁజూచి సంతసంబున మునుంగఁగలవు. మాతండ్రి

తోఁగూడవచ్చి నిన్నుఁగలిసికొనియెదను. నీకెట్టిసందేహ మునువలదు. దైవమునే నమ్మియుండుము. నాకేభయంబును లేదు. మాతండ్రినన్ను దనకుమారునిగా నెఱింగి శాశ్వత సుఖంబులొసఁగూర్చును. గాన నాకు సెలవొసంగుము.

మోహి — నీవిట్టిపట్టువలఁబట్టిన నేనేమియుఁజెప్పఁజాల. మీతాత యిఁకముందెన్నఁడో యుద్ధమునకుఁ బంపనున్నాఁడని విన్న నాఁటినుండియే గంపెడుదిగులుతో నున్నాను. ఇఁకనేఁడే బయలుదేఱెదనను నీమాటలువిన్న నాప్రాణము లెట్లునిల్చును? మఱచితిని. ఇప్పుడుమీతాత కబురుపంపినాఁడఁట యెందులకు?

ప్రతాప — తనస్థితినేదియో తెల్పుటకు.

మోహి — ఏమని తెల్పెను?

ప్రతాప — ఏమనియా! వినుము.

తే॥ గీ॥ ఆంధ్ర సామ్రాజ్యరత్న సిం ♦ హాసనమున
కూతఁగ మాదుపూర్వులు ♦ లుంచి యున్కి
దాస్యభారంబు వలన మా ♦ తలలు నొచ్చె
దాస్యమెడఁదోసి మాకుస్వా ♦ తంత్ర్యమిమ్ము! ॥

అని యట్లొనర్ప నాచేత వాగ్దానము చేయించుకొనెను.

మోహి — (తనలో) అవురా! నేననుకొనినంతయు జరిగినది. (ప్రకాశముగా) కుమారా! నీవా వీరికి స్వాతంత్ర్యము నిచ్చువాఁడవు.

ప్రతాప — తల్లీ! యీమాటనటుంచుము. ముందునాతండ్రిని వెదకుటకై నన్ను బోనిమ్ము.

మోహి — అదిగో! మీతాతవచ్చుచున్నాఁడు. మీమీయిష్టప్రకారము చేసికొనుఁడు.

ప్రతాప — మాతాత యీవఱకేనాకు సర్వసైన్యాధిపత్యమొసంగియుండెను. అట్టియెడ విజయయాత్రకేగదననిన వలదనునా? వలదనిన నాతండొసంగిన బిరుదమేమిటికి?

( మాధవవర్మ ప్రవేశము )

మాధ — నాయనా ! ఏమి, తల్లితోఁ దగవులాడుచున్నాఁడవు?

ప్రతాప — తాతా ! ఏమియును లేదు ! విజయయాత్రకై దేశ సంచార మొనర్పవలెనని యుండి మాతల్లి యాజ్ఞ నడుగు చుంటిని.

మాధ — అందులకు మీతల్లియేమనుచున్నది ?

ప్రతాప — వలదని నివారించుచున్నది.

మాధ — ఈవిజయయాత్రకై నిన్నుఁ బ్రేరేపంచిన వారెవరు ?

ప్రతాప — మత్పితృసందర్శనోత్సాహము.

మాధ — ఈ విజయయాత్రచేఁ బితృదర్శనమెట్లగును ?

ప్రతాప — తాతా ! నాతండ్రి విజయయాత్ర యొనర్చుచు దేశా టనమొనర్చుచుండెనని వింటిని. నేనును విజయయాత్ర గావిం చుచు నార్యావర్తమునంగల సకలరాష్ట్రంబులకేగి యందున్న వీరవరులనెల్ల జయించుచుఁ బోవుచుండ నాప్రఖ్యాతిని విని నాజనకుఁడెందేని నన్ను దారసిలకమానఁడు. అంతటముం దుగా నాజన్మవృత్తాంతమాతని కెఱుకపడనీయక నాపరాక్ర మంబెల్లఁ జూపించి యాతనివశీకృతుఁ గావించుకొందును. బాలుఁడనని యొకవేళ నాతండ్రి నాపైకిరా నిచ్ఛగింపఁడేమో యని యీవిజయయాత్రయందు మునుముందుగాఁ గొంతమంది వీరులను జయించితినేని నాప్రఖ్యాతివినియైన నాతఁడు తప్పక వచ్చును. మఱియు నీవిజయయాత్రచే నాతండ్రితో సమా నుఁడనగుటకైన శక్తిని గడించుటకిదియొక సాధనగానుండును. అన్యులెవరేని బలమదోద్రేకమున వచ్చిరేని సునిశితబాణ పరంపరలచే యమపురంబున కనిపెదను.

మాధ — అటులైనచో నొకయుపాయముఁ జెప్పెదను. దాన నీతండ్రి నతిసులభంబునఁ గనుఁగొనఁగలవు.

ప్రతాప — తాతా ! చెప్పుము.

మాధ — కుమారా! యిప్పుడు వీరసింహుఁ డెందున్నదియుఁ దెలియదుగదా? వానికొఱకు దేశదేశంబులెల్లఁ దిరుగుటకన్న నీవు కల్యాణపురంబుపై దాడివెడలుచు మార్గమధ్యమందున్న వీరవరులనెల్లఁ దునుమాడుచున్నచో నీపేరువిని భయంబునఁ గల్యాణపురవరాధీశుండు తనకీడుగడ యగు వీరసింహుని దప్పక పిలిపించును. కావునఁ దొలుదొల్తఁ గల్యాణపురిపై దాడి వెడలుము. నీకుఁదగు సైన్యమును నిరువురు సేనానులనొసంగెద. వారిసాయంబుచే నీకార్యము నెఱవేఱఁగలదు.

ప్రతాప — తాతా! నాకొరులసాయమేల? పోరిన నొంటరిపాటుననే పోరాడవలయును. కాన ద్వంద్వయుద్ధమే ముఖ్యము.

మాధవ — నీయిష్టమువచ్చినట్లు ద్వంద్వయుద్ధమునేచేయుము. ఒకప్పుడవసరమువచ్చునుగనుక వారినిగూడ సహాయముగాఁ బంపెదను. [మోహినివంకఁజూచి] అమ్మా! జగన్మోహినీ!

శా॥ బాలుండీతఁడు యుద్ధరంగములనే ♦ బ్భంగిన్ జయంబందునం
చాలోచించెద వంతెకాని బలధై ♦ ర్యైశ్వర్య వీర్యంబులన్
బోలంజాలునెవండు నీసుతుఁడ సా ♦ మ్యుండంచు గుర్తింపుమా
కాలాభీలత వైరిమారకుఁడునౌ ♦ కాలుండు బాలుండొకో ॥

మోహిని — జనకా! చెట్టఁబట్టినభర్త సంగ్రామరంగంబులపాలగుటచే దుర్భరంబగు భర్తృవియోగ దుఃఖంబు ననుభవించుచు నెట్టులనో యీనాముద్దుకుమారుఁజూచుకొని మేనఁబ్రాణంబులు దాల్చియున్నాను. ఇంతదాఁక నాకన్నుల పండువుసేయుచు నావియోగదుఃఖమునకు విశ్రాంతిగల్గించుచు నాప్రాణములకుఁ బ్రాణమైయున్న యీమురిపెంపుసుతుఁడుకూడ రణభూముల కేగిన నేనేరీతిఁ బ్రతుకుదాన? పెద్దవాఁడవగు నీవుకూడ నీరీతి వచించిన నేనేమనుదాన?

మాధవ — అమ్మాయీ! వృథాకంఠశోషణ మేలచేసికొనెదవు? క్షత్రియపుత్రుండు రణరంగంబులఁ దన పరాక్రమముఁజూపక

యోడుదానివలె నింటఁగూర్చుండుదునా ? శత్రుసంహారమొన ర్చి తల్లిదండ్రులకానందము గూర్పవలయునేకాని యాటపాటలచే నీయుద్ధముచ్చట లెన్నాళ్లితీర్చుచుఁగూర్చుండుదును. ఇది క్షత్రియుల కనుచితము. అబలవగుటచే నిట్లుతలంచుచుంటివి. కాని వీరమాతల కదితగదు. చిరవాంఛితంబగు నీభర్త్రసమాగమమును నీకుమారునివలనఁ గలుగఁగలదు. కావున వాని గమనమునకై కంటఁదడిఁబెట్టకుము.

మోహి — తండ్రీ! మీయిష్టమువచ్చినట్లు చేయుఁడు. నాకు మాత్రి మీ దుఃఖభాజనంబగు మనుగడకన్న విసమాని ప్రాణంబులనైన విడుచు టుచితము. ( అని నిష్క్రమించును )

ప్రతాప — తాతా! మాతల్లినేవిధంబుననైనను శాంతిపఱచి వచ్చెదను. నీవు యుద్ధమునకుఁ దగుప్రయత్నములఁ గావింపుము. ఇపుడనే పోయెదను. ( అని నిష్క్రమించును )

మాధ — (తనలో) ఆహా! యీపదునాఱు వర్షంబులకుఁగదా నాయాశాలత యీప్రతాపసింహుని ప్రతాపవర్షంబునఁ దిరిగి చిగుర్పఁదొడంగెను. వీరసింహుని మేనఁ బ్రాణంబులున్నంత దనుకఁ ద్రిలింగరాజ్యమును జయింపఁజాలననుకొంటిని. కాని యీప్రతాపసింహునిజాడ నాఁటినుండియు మెల్లఁ దీఱుచున్నది. వీనిచే నాంధ్రరాష్ట్రంబును జయింపఁగలనను ధైర్యముగల్గుచున్నది. వీనినెంతయో పురికొల్పి యాంధ్రదేశంబుపై దాడి వెడలఁజేసితిని. వీరసింహుఁ డాంధ్రదేశంబునఁ దెక్కడను నుండినట్లుతోఁపదు. కావున నవలీలరాజ్యమును దనవశంబుఁ జేసికొనఁగలండు. ఒకవేళ వీరసింహుఁడరుదెంచినను ధైర్యస్థైర్యములం దీబాలుండు తండ్రికెంతమాత్రముఁ దీసిపోవువాఁడు గాఁడు. కాన నిక్కముగా జయించును. ఒకవేళఁ దండ్రిచేఁ జచ్చినచోఁ దరువాత నాబాలుఁడు తనతనూభవుండుగా నెఱింగి ప్రాణంబులు విడుచుట నిక్కంబు. అప్పుడును రాజ్యము మన

కవలీలగా వశముగాఁగలదు. వీరసింహుని నెఱింగినవాఁడీవనం
తఁడుదప్ప నన్యులెవ్వరును లేరు. కావున వసంతునకేదే నాశఁ
బెట్టి వీరసింహుని గుమారున కెఱిఁగింపకుండునట్లు చేసెద.
ఎట్లని వారిరువురకుఁగయ్యముజరుగునట్లు చూడుమని వానికిఁజె
ప్పెదను. యుద్ధానంతరమొకరినొకరెఱుంగునట్లుచేసెద. అంతట
మనకార్యము నెఱవేఱఁగలదు. కాన నేనును వెంటనేపోయి
విజయయాత్రకుండగు ప్రయత్నముం గావించెదను.

( అని నిష్క్రమించును. )

ఇది షష్ఠాంకము.





# Veera Pra

# ❧ వీరప్రతాప్.

## సప్తమాంకము.

[ వీరసింహుఁడును సేవకుఁడును బ్రవేశింతురు ]

వీర — సేవకా! ఆశత్రువులెవ్వరైనదియుఁ దెలిసికొంటివా?

సేవ — స్వామీ! కళింగదేశీయులని తెలిసినది. పదిపదాతేండ్ల ప్రజ్ఞావాఁడా సైన్యమున కధిపతియఁట. ఆతఁడు ద్వంద్వయుద్ధంబునఁ జండీశ్వరీ గణపతులనోడింపఁగాఁ జండీశ్వరి మాయోపాయంబునఁ దప్పించుకొని కోటలోనికిఁ బారిపోయి మూలదూఱెనఁట. గణపతి వారిచేఁజిక్కెనఁట.

వీర — ఏమి! చండీశ్వరీ గణపతులే యోడిపోయిరా? అట్లైన నాతఁడెవ్వఁడోకాని యసాధ్యునివలె నున్నాఁడు. తరువాత నేమయ్యెను?

సేవ — అవసానసమయ రుద్రునివలె నాబాలుండు మండిపడి దుర్గంబును దహించివేయఁ దనసైనికుల కాజ్ఞయిడెనఁట.

వీర — తరువాత నేమిజరిగెను?

సేవ — ఆయాజ్ఞ నెఱింగినవారై కోటలోని వారెల్లరు లోపల నుండి త్రవ్వఁబడిన యొకసొరంగమునుండి కల్యాణపురంబుఁ జేరిరి. ఈవృత్తాంతము మీకెఱుకసేయవచ్చితిని.

[ వేఱొక సేవకుఁడు ప్రవేశించును. ]

వీరసింహుఁడు — మంచిది. నీవిఁకఁ బోయిరమ్ము (సేవకుఁడు నిష్క్రమించును. రెండవసేవకునిదిక్కు) ఓయీ! నీవార్తలేమి?

రెండవసేవ — కళింగసేనాధిపతియగు నొక బాలుండు కొలఁది పరివారంబుతోఁ గల్యాణ పురపరిసరంబులఁదండువిడిసి ద్వంద్వ యుద్ధమునకై పోటుమానిసు లాంధ్రలోకంబునందున్న రండని ప్రకటించుచుండ సింహగర్జనంబును విను మృగముల చందంబున వాని ఘకరవాక్యంబుల కదిరి ముఖముఖంబులు చూచుకొనుచు యోధులెల్ల నతనికడ కరుదెంచిరి.

వీర — తరువాత!

సేవ— విష్ణువర్ధనుండు కొంత తడిచింతించి యోధులతో నిట్లనెనఁట.

వీర — ఎట్లు?

సేవ — వీరసింహునివద్దకుఁబోయి వానిని క్షమాపణముఁగోరి మనకై పోరాడవలసినదిగాఁ బ్రార్థింపక తీఱదు. ఆతఁడువచ్చువఱకును నేదేని మిషతో యుద్ధమాపుదమని.

వీర — వీరసింహుఁడు రాకున్నచో వారేమిసేయఁదలంచిరి?

సేవ — పగవాని శరణుగోరి సంధిగావింప నిశ్చయించుకొనిరి.

వీర — ఛీ! ఛీ! ఎంతటిపరాక్రమ లజ్జావిహీనులు! తరువాత?

సేవకుఁడు — త్రివిక్రముఁడు కొందఱుయోధులతో నిట కరుదెంచుచున్నాఁడు.

వీర— అటులనా! మంచిది. సమాచారంబు లింకేమైనంగలవా?

సేవ — దేవా! ప్రస్తుత మింతకన్న విశేషములు లేవు.

వీర — మంచిది పోయిరమ్ము. (సేవకుఁడు వెడలిపోవును) సమర భీరువులగు వీరలకు దూషణభూషణంబులఁ బౌరుషంబుఁబుట్టించి సమరసన్నద్ధులఁ గావించెదను. పసిబాలుఁడగువానితోడ వీర సింహుఁడు సమరంబుఁజేయుట లజ్జాకరంబు. మాఱువచ్చెనేని మాఱువేషంబుననైన వానితోఁ బోరెదనుగాక. [ దిక్కులు

పరికించి] అదుగో వారలే వచ్చుచున్నారు. రానిమ్ము.
(అని కూర్చుండును.)
(త్రివిక్రముఁడును గొందఱు యోధులును ప్రవేశింతురు)
త్రివిక్ర — సీ॥ కుపితారిమదకుంభి ♦ కుంభవిచ్ఛేదనా
హ్లాదమృగేంద్ర! జో ♦ హారునీకు
రెండవ — మాతృభూపరిభవా ♦ న్మాదరోషస్వాంత!
చిత్తగింపుము నమ ♦ స్కృతులునీకు
మూఁడవ — శరణార్థిరక్షణా ♦ చారసంపన్నత
త్పరుఁడ! కైకొనుము వం ♦ దనమునీకు
నాల్గవ — భ్రష్టసామ్రాజ్య ప్ర ♦ తిష్ఠాపనాచార్య
బిరుద! జేజేల న ♦ ర్పింతు నీకు
అయిదవ — గీ॥ ఆంధ్రసామ్రాజ్య ధుర్య వి ♦ ఖ్యాతయశుఁడ!
నతజనావన! నాదుదం ♦ డములునీకు
ఆఱవ — నాయత భుజాఢ్య! వీరసిం ♦ హాంచితాభి
ధాన! నీకిదే హస్త సం ♦ ధానచయము.
వీర — (ఆనందంబున నాసనంబునుండి లేచి) త్రివిక్రమాది త్రిలింగయోధులారా? మీ కెల్లరకును స్వాగతంబు.
చం॥ వెలవెలలాడు మీవదన ♦ బింబములన్ బరికించిచూచినన్
గలుగునదేమొ సందియము ♦ కామితసిద్ధినిబొందుచున్ జనా
వళిసుఖమందుచుందురె? శు♦భప్రతిపాదిమె యాంధ్రమాత ? ని
ర్మలమతివిష్ణువర్ధనుఁడు ♦ రాజ్యమునేలునె? వేగఁదెల్పుఁడీ॥
మఱియు,
తే॥ కారణములేక యస్మత్కు ♦ టీరమునకు
రారుమున్నెన్నఁ డిట్టుల ♦ మీర లేరు
కాలగతినేఁటి కేదేని ♦ కష్టమొదవ
నంతనే తెంచిరంచు భా ♦ వింతుమదిని
త్రివిక్ర — ప్రజామనోభీష్టదాయకా! ఓ యాంధ్రచమూనాయకా!

సీ॥ ఆపాదమస్తక ♦ వ్యాప్తమౌ కవచంబు
ధగధగకాంతులఁ ♦ దగధరించి
కుడిచేత దీర్ఘమౌ ♦ కుంతంబు మెఱయంగ
లోకముల్ చూడ్కిఁ జీ ♦ కాకుపఱచి
బాణాకరంబగు ♦ తూణంబు వెనుఁజేర్చి
యతిశితాసిముల వ్రే ♦ లాడఁగట్టి
కలధౌతఖల్యా సం ♦ కలితకంఖాణమున్
వాకేలలాగి హు ♦ టాహుటించి
గీ॥ మానసోద్ధతరోష సం ♦ భాషణముల
హరిణముల వినోద కుఱుకు హ ♦ ర్యక్షమట్లు
లాంధ్రవీర చమూసమూ ♦ హముల పైకిఁ
జెలగె సమరావనిఁ బ్రతాప ♦ సింహ మనఁగ॥
రెండవ — యోధాగ్రణీ!
మ॥ పదియారేఁడుల బాలుఁడయ్యును రణ ♦ ప్రారంభ సంరంభుఁడై
కదనంబం దెదిరింపఁజాలిన త్రిలిం ♦ గప్రభులేరున్నరం
డిదె! నిల్వంబడుఁడంచుఁ బిల్వఁ జనఁడా ♦ మె న్వీరుఁ డొక్కండునిం
కెదిరింపన్ గలవార లేరు? రిపుమ ♦ త్తేభేంద్రపంచాననా!॥
వీర — ఆహా! యిదియా మనవారి పరాక్రమము. ఆ బాలుఁడె
వ్వఁడు? ఏ దేశంబువాఁడు.
మూఁడవ — తే॥ జన్మవృత్తాంతము నెఱుంగఁ ♦ జాలఁగాని
యల కళింగాధిపతికి సై ♦ న్యాధిపతియు
నాప్తుఁడనియుఁ బ్రతాపసిం ♦ హుండనియుఁ
బుడమి జనులాడుకొనుటఁగాఁ ♦ బోలువింటి॥
నాల్గవ — తే॥ చారుతరరూప రేఖాంగ ♦ సౌష్టవమున
ఘనభుజాటోపబలపరా ♦ క్రమములందు
నతనికిని నీకు భేదమా ♦ వంత లేదె
యతని సాటివి నీవె నీ ♦ కతఁడె సాటి॥

అయిదవ — అంతియేకాదు.

చం॥ పృథులపరాక్రమంబునమృ♦గేంద్రునిధైర్యమునన్ హిమాద్రినిన్
బ్రథనకళాప్రచారములఁ ♦ బాండవమధ్యముఁబోలువాని నం
బుద నినబార్భటిన్ సమర ♦ భూమిని ఢీకొనువాని నీవుగా
కెదిరిజయింపఁజాలు సను ♦ లెవ్వరుచెప్పుమ వీరసత్తమా ?॥

ఆఱవ —చం॥ పలువిధనీతులంగఅపి♦పార్థువుచిత్తముద్రిప్పఁగాఁబ్రజా
వళికయి విశ్వయత్నమునఁ ♦ బాటొనరించెను నీవె తేనిపై
నలుకనుబూని మమ్మిటు ల ♦ నాదరణన్ బరికించుచుండుట
య్యేలుకలమీఁదికోపమున ♦ నింటికిఁ జచ్చెదుచుంటగాదొకో॥

వీర — ఛీ! ఛీ! ఛీ! ఇదియామీపౌరుషము. చిరకాలమునుండి వానియన్నముం దినుచు వానికాపదవచ్చువేళ నిటు పారిపోయి వచ్చుచున్నారా ?

గీతమాలిక

అసమభుజవిక్రమ ప్రతా ♦ పాఢ్యశౌర్య
సుప్రసిద్ధాంధ్ర జగదేక ♦ శూరవరుల
వంశమందెట్లుపుట్టిరో? ♦ పందలార!
యక్కజంబుగఁదోఁచు మీ ♦ రుక్కసెడుట
వైరిఘుంఝానిలోద్ధూత ♦ శారదా॥
శకలమాయెనె మీపూర్వ ♦ సాహసంబు!
పరబలోత్తుంగవాహినీ ♦ భంగములను
నాఱిపోయెనె మీప్రతా ♦ పాగ్నియిపుడు ?
వైరిభూధరంబులఁదాఁకి ♦ ప్రక్కలగుచుఁ
దఱిఁగిపోయెనె మీమనో ♦ ధైర్యమెల్ల ?
శత్రురూక్షేక్షణ జ్వాల ♦ సైఁపలేక
మంటఁగలిసెనె మీయభి ♦ మానమెల్ల ?

పగఱపసికూనయెవఁడో గ ♦ ర్వంబుమీఱ
ప్రల్లదంబులుపల్కు మా ♦ త్రమునమీరు
భీతచేతస్కులగుచు ని ♦ వ్వెఱఁగుఁజెంది
సమరభూమినివిడిచి రాఁ ♦ జనునె మీకు ?
శాత్రవులఁజంపి మగుడి రాఁ ♦ జనునుగాక
పగతునకు వెన్నుఁజూపింపఁ ♦ బౌరుషంబె ?
కాయములపైనిబ్రీతి యీ ♦ కడకుఁ దెచ్చె
మానవునకెప్డు తప్పు ♦ దేనికాని
మృత్యులోకవిహారంబు ♦ సత్యమగుట
సర్వసామాన్యగతికి వి ♦ చారమేల ?
మానవుడుగంట దేహాభి ♦ మానమేల ?
భాగ్యభోగ్యములేల ? జీ ♦ వంబులేల ?
రణనిహతులైనఁగలదు స్వ ♦ ర్గంబుమీకుఁ
గాని రణభీరువులకెందుఁ ♦ గలదుకావు?
వీరులగు పెద్దవారల ♦ పేళ్లుసెప్పి
బ్రతుకుటింకెంతకాలంబు ♦ భావ్యమగును ?
వీరసింహుఁడెల్లపుడు జీ ♦ వించువాఁడె ?
పరబలంబున నాధార ♦ పడుటదగునె ?
కాన జీవితాపేక్షలు ♦ మాని మీరు
చంపుటకొ లేక యరిచేతఁ ♦ జచ్చుటకునొ
సిద్ధసంకల్పులై కత్తిఁ ♦ జేతఁబూని
కదనసీమను బాహువి ♦ క్రమ మెలర్ప
శాత్రవాళికి గుండెలు ♦ జలదరింప
సమరమొనరించి శశ్వద్య ♦ శంబుగాంచి
యాంధ్రజననీమతల్లి హ ♦ ర్షాబ్ధిముంచి
తెలుఁగువారల శౌర్యంబుఁ ♦ దెలియఁజేసి
పేరు గాపాడుకొనుఁ డాంధ్ర ♦ వీరులార!!!

త్రివిక్ర — మేము పోరఁగలిగినవో నీయెదకు సిగ్గు చంపుకొని వత్తుమా ?

వీర — మీమాటలవినుటకు నాకెంతయో లజ్జాకరముగానున్నది. లేఁబ్రాయంపు వీరవరులెందఱోయుండ నేనే యాతని జయింప వలయునా ? కుమార్తెకు మాఱుగా నాకట్టి కుమారరత్న మెుందు జనించెనేని వాని ననికనిపి, వానిసమరవిజయంబుల లోచనోత్సవంబుఁ గావించికొనుచు హాయిగఁ బ్రొద్దుపుచ్చు చుందునుగదా. అక్కటా! అట్టిభాగ్యంబునకు నోఁచనైతిని. మంచిది, మీరాజువంటి విశ్వాసహీనులనమ్మి యిట్టిబలవరాక్రమ శౌర్యధనుఁడగు నబ్బాలునిజంపఁ జేయాడదు. అంతియేకాక సమరంబు లింతటితోఁజాలింపఁ దలంచియుంటిని.

త్రివిక్ర — కోపముంజెందవేని నీమిత్రుఁడొక విజ్ఞప్తిని జేసికొన నున్నాఁడు.

వీర — ఏమది ?

త్రివిక్ర — తే॥ అర్భకుఁడొకండు తనకీర్తి ♦ నపహరించు
ననెడు శంకను వీరసిం ♦ హాంకుఁ డిప్పు
డరిని ఢీకొన రాఁడయ్యె ♦ నను వదంతి
వినుచు నెబ్బంగి నింక జీ ♦ వింతుమిత్ర ? ॥

వీర — ఛీ! అదేటిమాట ?

మ॥ క్షితినొక్కండు యశంబువేఁడొకఁడు దు♦ష్కీర్తిం దలందాల్చెఁ డా
నతిధీరుండొకఁడౌను భీరువొకఁడౌ ♦ నన్యప్రకర్షంబుచేఁ
బతితంబౌనొకొ స్వప్రకాశము సము♦త్పన్నుండఁగానా? యిటుల్
శ్రుతిబాహ్య ప్రతిభాషలెల్లఁ బలుకన్ ♦ జోద్యంబగున్ సిగ్గరీ!॥

జగదేకవీరుఁడని లోకము వానిని బొగడనిమ్ము. దానికి నేనీర్ష్యఁబొందనేల ? మీరాజును మీరునుగలిసి మీసత్త్వంబులెల్లఁ జూపి వానిఁ బరిమార్పుఁడు.

త్రివిక్రమ — దేవా! యీమాసత్త్వములనెల్లఁ జూపింప వృథయగు టయేకాక ప్రాణమాత్రావశేషులమై కూడవచ్చితిమి. కావున మాయువల్కూరదేశమును మీపజలను గాపాడు భారము నీయందున్నది. కావున మమ్ము క్షమించి మా ప్రార్థన మన్నింపుము.

వీర — [యోజించి] అట్లయిన నో త్రివిక్రమాదియోధులారా! మీరుపోయి మీమీ బలంబులొడ్డి పోరుచుండుఁడు. నేనిదే మాఱువేషంబునవచ్చెదను. నారాక నేరికిని దెలియనీయ వలదు. నావిక్రమోపార్జితయశోలక్ష్మి నేబాలవీరుండు హరించునో చూచెదఁగాక పొండు.

త్రివిక్రమాది యోధులు — ధన్యాత్ములమైతిమి. భవదాజ్ఞాను బద్ధులమై పోవుచున్నారము.

[ అందఱు నిష్క్రమింతురు. ]

వీర — ( తనలో ) అవురా! ఆబాలుఁడెవఁడో యింతశౌర్య యమునకే యిందఱాంధ్రవీరులకు వెఱపుగొలుపఁగల్గెనే! మామాన్యవైరంబులెట్లున్నను బరుఁడొకండు దండెత్తివచ్చినప్పుడు మేమేకీభవించి వానిని నిర్మూలంబుఁ జేయవలయుఁగదా. మావైరంబులచే వారికేమాత్రమేని మార్గమొసంగితిమేని దేశద్రోహులమగుదుము. జగద్విఖ్యాతివడసిన నాయట్టివాఁ డొకబాలునితోఁ బోరొనర్చుట హాస్యాస్పదముగా నుండును. గానఁ బ్రచ్ఛన్నవేషంబునంజని పగఱఁబరిమార్చి వచ్చెదను.

[ అని నిష్క్రమించును. ]

ఇది సప్తమాంకము.



# Veera Prathap.

# వీరప్రతాప్.

---

## అష్టమాంకము.

[ ప్రతాపసింహుఁడును వసంతుఁడును బ్రవేశింతురు ]

**వసంతుఁడు** — మిత్రమా! లక్ష్మి తాండవ మాడుచున్న దా యననొప్పు నీనగీతటంబులఁ జూడుము.

తే॥ పంటయెకిరీఁడు పవళించు ♦ పానుపనఁగ
వసుమతీదేవి పఱచు తి ♦ వాసియనఁగ
దరులఁజెన్నారు దివ్యకే ♦ దారవితతి
యాంధ్రసామ్రాజ్యభాగ్యభో ♦ గ్యములఁదెలుపు॥

**ప్రతాప** — మిత్రమా! సత్యము.

సీ॥ స్నానపానంబుల ♦ జనులఁ బుణ్యానిఁజేయు
పావన కృష్ణాస్ర ♦ వంతి యిదియె!
యాబాల్యమాతని ♦ యంఘ్రి ఘట్టనలచేఁ

జదిసిన ఖేలన ♦ స్థలము లివియె !
జనకళశ్వ ద్యశ ♦ శ్చంద్రికా నారంబు
వ్యాకీర్ణమైన రా ♦ జ్యంబు లివియె !
అరిమదేభేంద్ర పం ♦ చాస్యమౌ వీరసిం
హనివాస గహనరా ♦ జ్యంబు లివియె !

తే॥ స్థలవిశేషంబొ ? పైతృక ♦ స్థానబలమొ ?
తనువు పులకించెఁ దద్దివ్య ♦ దర్శనమునఁ
పైతృకంబునకే యింత ♦ భ్రాంతిగలుగఁ
బితనె దర్శింప నింకెంత ♦ ప్రేమమిడునో ! ॥

వసంతుఁడు — మిత్రమా ! అప్పుడె పితృమోహముగల్గుచున్నదా?

ప్రతాప — తండ్రిపై మోహముగల్గని వాఁడొకఁడుండునా ?

వసంత — కాదు. కాదు ఆంధ్రులు మనతోడి ద్వంద్వయుద్ధంబునకై యొకదినంబు గడువడిగియుండిరిగదా! అంతలోపల మీతండ్రియగు వీరసింహుని బిలిపింపవలయునని కాఁబోలు ? ఒకవేళ వీరసింహుఁడే ద్వంద్వయుద్ధమునకు వచ్చినచోఁ బితృమోహంబున సంధిగావించుకొనెదవా ? తాతకిచ్చిన మాటప్రకారము యుద్ధమొనర్చెదవా ?

ప్రతాప — మిత్రమా !

సీ॥ బవరంబునందు మ ♦ ద్బాహుసారముఁజూపి
మాతామహుని పరా ♦ భూతిఁదీర్పఁ
గంకణంబును దాల్చి ♦ కన్నతండ్రియటంచు
సంశయించిన క్షాత్ర ♦ సంభవుఁడనె ?
అతని కేఁబుత్త్రుఁడ ♦ నంచుఁ దెల్పినమీఁద
బవరంబునకు నిష్ట ♦ పడునొ పడఁడొ ?
బవరంబునకు నిష్ట ♦ పడకపోయినమీఁదఁ
దాతకిచ్చినమాట ♦ దబ్బరగుచు

తే॥ గీ॥ గాననెట్లేనియతఁడు సం ♦ గ్రామమునకు
వచ్చుమార్గంబు చింతింప ♦ వలయుఁగాన
బుత్రిసంజ్ఞను దెల్పకే ♦ పోరొనర్ప
ధీబలంబుల నతఁడె గు ♦ ర్తించుఁగాక ॥

వసంత — (దిక్కులు పరికించి) అరుగో శాత్రవులు తమశిబిరంబుల నెలకొల్పుచు సమరసన్నాహములఁ జేయుచున్నారు.

ప్రతాప — ఆశిబిరంబు లెవరెవరివైన నదియు నోరుగంటి దుర్గాధిపతి యెఱింగియుండును కావున వానినిటకుఁ గొనిరమ్ము.

(వసంతుఁడుపోయి గణపతితోఁ బ్రవేశించును)

ప్రతాప — (గణపతిదిక్కై) ఓయీ!

సీ॥ నవరత్నములచేత ♦ నవఘటించినయట్టి
హరిద్ర రుచిరచే ♦ లాంచలముల
నంచె లంచెలఁగట్టఁ ♦ బంచవర్ణంబులఁ
గెరలి యాడెడు నట్టి ♦ కేతనముల
నిరుకెలంకుల బరా ♦ బరులొనర్పఁగ నిల్చు
నంగరక్షకుల క ♦ రాసికముల
వందిమాగధ జన ♦ సందోహ మొనరించు
మంగళాశీర్వాద ♦ మంత్రములను

తే॥ బరబలంబులకెల్ల ది ♦ గ్భ్రమలు గొల్పి
సమరపులకాంకురములు దే ♦ హమునఁ బొడమ
స్వబలములకెల్ల నిండు సం ♦ భ్రమముగూర్చు
పటకుటీరంబుఁజూడు మె ♦ వ్వారిదగునొ ॥

గణపతి — (అనుమానించి తనలో) వీరసింహుండు ప్రచ్ఛన్నవేషంబునఁ దిరుగుచున్నాఁడుగదా! యిదినిక్కముగా వీరసింహునిదే. శాత్రవుల భయపెట్టుటకై రాజవిధంబున నాతని శిబిరంబును నెలకొల్పియుండెనేమో? యేదియెట్లున్నను నితఁడు రహస్యవృత్తి నున్నప్పుడు నేనేల వానియుదంతమును బయలు

పెట్టవలెను. కావున నీవిధంబునఁ జెప్పెదను. (ప్రకాశ ముగా) నూతనముగాఁ జోళదేశాధీశునిచేఁ బంపఁబడిన చమూపతి శిబిరమని తలంచెద.

ప్రతాప — ఆతని పేరెఱుంగుదువా ?

గణపతి — పేరువింటినిగాని క్రొత్తగా నుండుటచే మఱచిపోతిని.

ప్రతాప — (తనలో) వీరసింహుని పటకుటీరమునకు హరిద్రవర్ణమే చిహ్నమని మున్నొకమాఱు వినియుంటిని. అదికాదు గదా ? (గణపతిదిక్కై) ఓయీ ! అది వీరసింహునిది కాదా ?

గణపతి — ఆతనిదియు నిటులనే యుండును గాని యిదిమాత్రము కాదు.

ప్రతాప — (తలవంకించి తనలో) ఈతఁడబద్ధమాడుచున్నాఁడు. కొంచెము బెదరించిచూచెద. (ప్రకాశముగా) ఓయీ !

శా॥ చేతంజిక్కితివీవు! చూడుమిదె నా ♦ చేతంగృపాణంబునీ
వాతన్‌బొల్లొకయింత రాఁదగదుస ♦ త్ప్రత్యుత్తరంబీవిచోఁ
గాతున్నిన్నను మాటవట్టిదిఁక శం ♦ కాలేశమున్నీవుచు
న్నీతుచ్ఛత్వమడంగఁగూల్చితినయే ♦ నిన్నెవ్వ దిక్కెవ్వరో ॥

గణపతి — నమ్ముము నమ్మకుండుము. నాకుఁదోఁచినది చెప్పితిని. ఆపై నీయిష్టమువచ్చినట్లు చేయుము. నన్నుజంపుటకే నెపంబుగావలయునా ? నేనిదివఱకే నీకుఁజిక్కితిని.

ప్రతాప — పోనిమ్ము (మరల ముందునకవలోకించి) ఓయీ ! అటుచూడుము.

చం॥ భటసముదాయముల్ ఘనకృ ♦ పాణములన్ ధరియించి సర్వదిక్తటములఁగాచుచుండ నిభ ♦ కాండము ప్రాంగణసీమనిల్వ వి
స్ఫుటగతిఁ కేతనముల్ గగన ♦ చుంబితవృత్తిఁజెలంగుచున్నయా
పటభవనంబదేరిదో ! య ♦ బద్ధములేక నిజంబుఁజెప్పుమా ॥

గణపతి — అదియే విష్ణువర్ధనుని శిబిరము.

ప్రతాప — దానికి నుత్తరపార్శ్వమునందున్న శిబిరమెవరిది?
గణపతి — త్రివిక్రముఁడను శాని యాంతరంగిక సచివునిది.
ప్రతాప — ఇందెక్కడను వీరసింహునిది లేదా?
గణపతి — వీరసింహుఁడు దేశాంతరగతుండయ్యెనుగదా. రాజు పైస్పర్ధచే నాతఁడు వచ్చినట్లు లేదు.
వసంతుఁడు — మిత్రమా! దిగఁబోవుచు లోఁతడుగునట్లిపుడీ ప్రశ్నము లేల? మనమును రణరంగమునఁ బ్రవేశించి వారలఁ బోరికిఁ నిలుతమురమ్ము.
ప్రతాప — మంచిది. అటులనే కావించెద.
ఉ॥ శూరవరేణ్యుఁడన్ ఘనయ ♦ శోధనకాముఁడ దోర్బలాతి దు
ర్వార రిపుప్రభంజనుఁడ ♦ భండనమం దెదిరించు సాహసో
దారులు శుక్రనిర్యజని ♦ త ప్రతిభల్ గలరేని యాంధ్రభూ
వీరులు నీరులేని భుజ ♦ విక్రమమున్ బ్రకటింపరండిఁకన్ ॥
వసంతు — మిత్రమా! అటుచూడుమటుచూడుము.
మ॥ చిరకాలంబగు క్షుద్వ్యథాక్షుభితమా ♦ సింహంబుగర్జింపఁగాఁ
గర ముద్వేగమునన్ దిగంతములదాఁ ♦ కన్ బారుచున్నట్టియా
హరిణవ్రాతమువోలెఁ దావకవచో ♦ వ్యాఘాతచిత్తంబులన్
బరుగుల్ వెట్టుచునుండు నాంధ్రులరుగో! ♦ పావంబువీక్షింపుమా॥
ప్రతాప — పాఱిపోవుచున్న తనబలంబులవలదని నివారించుచు ముందున కెవఁడో వచ్చుచున్నాఁడు.
వసంతుఁడు — ఆతఁడే వారినాయకుఁడై యుండవలెను.
ప్రతాప — ఏమి! వీరసింహుఁడా?
వసంతుఁడు — కాదుకాదు. వీరసింహుని నేనెఱుంగనా?

[వీరసింహుఁడు ప్రవేశించును.]

వీర — మ॥ అరరే బాలక! కన్నుగానకిటు వా♦గాడంబరప్రక్రియా
తురతన్వీరులఁ దూలనాడెదవె? ఖ ♦ ద్యోతంబుఖద్యోతుపై

కుటుకిన్ జూచి చెడిరీతి నెయ్యెడను వీ ♦ రోత్తంసులన్ దూలు మ
చ్చరి జీవింపఁగలండె నిల్వుమిదె నీ ♦ శౌర్యంబువారించెదన్ ॥

( బాలకునివంకఁజూచి యాశ్చర్యమునఁ దనలో ) రూపరే ఖాతిశయంబులందితఁడు కళింగునివలెఁ గాన్పించుట లేదు. త్రివిక్రమాదులు చెప్పినట్లీతఁడు నిక్కముగా నన్నుఁ బోలియున్నవాఁడు. జగన్మోహినికిఁ బుట్టిననాకుమారుఁడుగాదుగదా ! కాదు! కాదు! స్త్రీశిశువు జన్మించినదని యాపె వార్త నంపియుండెనుగదా. కాని వీతని నడిగి తెలిసికొనియెద. (ప్రకాశముగా) బాలకా! నీవెవరవు?

ప్రతాప — వైరివీరుండను.

వీర — కాదు. నీకులగోత్ర నామము లేవియని.

ప్రతాప — నాకులగోత్రములతో నీకేల? కుంతునియ్యనెంటివా?

వీర — బాలకా ! అట్లుకాదు.

కం॥ తమతమ కులనామ విశే
షములెల్లన్ దెలుపుకొనుచుఁ ♦ జయ్యనవీరుల్
సమరంబు సేయుచుండుట
సమయముగాఁబట్టి పృచ్ఛ ♦ సలిపితిఁ గుత్రా ! ॥

ప్రతాప — అట్లైని వినుము. నాది క్షత్రియకులము. పేరు ప్రతాపసింహుఁడు.

వీర — ( ఆనందమునఁ దనలో ) ఓహో ! రూపమే కాక నామసామ్యముకూడఁ గలదే. ఏమి ! యీకుమారుని చాక చక్యము. మొదటఁ గోపావేశంబునవచ్చినను వీనిజూచినదాది నాకేలకో యొకవిధమగు మమకారము గల్గుచున్నది. కానిమ్ము. (ప్రకాశముగా) బాలకా ! నీవైరమునకుంగల కారణమేమి?

ప్రతాప — మొదటిది కళింగస్వాతంత్ర్యము. రెండవది యశో వాంఛ.

వీర — ఓహో ! ఈనోటి పొల్లుల చేతను గుప్పిగంతుల చేతను స్వాతంత్ర్యమును యశమును గడింపనుంటివా ?

ప్రతాప — కాదు. కాదు. నీతలదన్నువీరులఁ దలఁదన్ని యుద్ధ
ముగడింపనుంటిని.

వీర — (తనలో) ఏమినిర్భీతి. (ప్రకాశముగా) శాంతముగా
మాట్లాడుము.

ప్రతాప — యుద్ధమున కైవచ్చిన నాకు శాంతవచనంబు లేల?

వీర — బాలకా!

సీ॥ సతతంబు నీవు దా ♦ స్యముసల్పు కామినీ
మణులచే నలరు హ ♦ర్మ్యముల నెగడి
ముద్దుమాటలకుఁ బ్ర ♦ మోదంబుఁ జెందెడి
నీమాత మృదులాంక ♦ సీమ వదలి
యాట పాటలయందు ♦ నహరహంబులు సంత
సంబిచ్చు ఖేలన ♦ స్థలముఁ బాసి
యఖిల శాస్త్రంబుల ♦ నభ్యసింపఁగఁ జేయు
గురు కులావాస స ♦ద్గోష్ఠి మాని

గీ॥ త్రిజగదాభీల నినద వి ♦ జృంభమాణ
భగ్నమస్తిష్క మాంస ప్ర ♦ పాతబహుళ
రుధిర కంకాళ పూరిత ♦ ప్రధనభువికి
నరవి నిర్భీతినిట్లు రాఁ ♦ జనునె కుఱ్ఱ?॥

ప్రతాప — ఓహో! సమరమన నీవే యెఱింగినట్లుగా మాట్లా
డుచున్నాఁడవే? నేనిట్టిసమరంబుల నిదివఱకనేకములు గాంచి
యుంటిని. కావున నీవంతగాఁ బరిహసింప నక్కఱ లేదు.

వీర — కుఱ్ఱఁడా! నీతోఁ బరిహాసములాడుటకు రాలేదు. కాని
నీవొనర్చినది కానిపనియని తెల్పుటకై వచ్చితిని.

ప్రతాప — అదెట్లు కానిపని?

వీర — ఎట్టులనా, వినుము.

ఆ॥ సమవయస్కుల కిల ♦ సమరంబుగాఁ జెల్లు
సిగ్గు శెగ్గు వలని ♦ చింత లేక

ఖ్యాతిఁ జెందినట్టి ♦ యాంధ్రవీరుల నిట్టు
లనికిఁ బిల్వఁదగు నె ♦ యర్భకుండ ? ॥

పత్రితాప — ఆహా ! ఏమి నీరణనీతి !

మ॥ అలఘు స్ఫారధనుర్ధనుల్ కుశలవుల్ ♦ హంవీరుఁడై నట్టి దో
ర్బల సంపన్నుఁడు పార్థనందనుఁడు న ♦ ల్పప్రాయులై నన్ రణ
స్థలి ధీరత్వముఁజూపి శాశ్వతయశ ♦ స్సంపాదకుల్ గారొకో ?
బలదర్పోద్ధతులాత్మతేజము వినా ♦ ప్రాయంబులన్ జూతురే? ॥

ఓయీ! నేనును నీవలెనే క్షత్రియోచిత విద్యలయందారితేరినవాఁడనే కావున మగఁటిమి యున్నచో మార్కొనుము. లేదేని వెనుకంజవేయుము.

వీర — (తనలో) శాంతవచనంబు లీతనిచెవుల నాటుటలేదు. శ్రుతిమించుచున్నది. ఇఁక బెదరించి చూచెదను (పత్రితా శముగా — కోపము నభినయించి) ఏమనుచుంటివి ? నిన్ను మార్కొనుటకు మగంటిమికూడఁ గావలయునా ? ఇటుచూడుము.

చం॥ రవికిరణ ప్రభాసమ శి ♦ రస్త్రముగాంచుము వజ్రసామ్యమౌ
కవచముఁజూడు నాబిగుతు ♦ కాసెను వేల్పులుకృపాణిఁజూడు,మున్
బవరములన్ సహస్ర మద ♦ వైరులఁ ద్రుంచితినేను, లేఁత కూ
నవుగద నీవికేల కద ♦ నంబునకుం బురికొల్పెదక్కటా ! ॥

పత్రితాప — ఓవాకూఛ్ఛరశిఖామణీ ! మంత్రములకుఁ జింతకాయలు రాలునా ?

వీర — ఓరీ యర్భకా ! పైత్యరోగికిఁ బంచదార చేదనునట్లు నా శాంతవచనంబులు నీచెవుల నాటుటలేదు.

ఉ॥ బాలుఁడవంచు యోద్ధవరి ♦ పాటి నెఱుంగవటంచు నింతగా
జాలివహించినన్ వినవు ♦ చచ్చిన వచ్చెడిదేమి ? జీవముల్
బాలిచియున్న నుత్తమప ♦ దంబు క్రమంబుగఁ గల్గవచ్చు నీ
మేలును గోరిచెప్పితిని ♦ మేలముగాదు గ్రహింపు బాలిశా ! ॥

ప్రతాప — ఓవీరుఁడా ! వినుము.

ఉ॥ మాటలుపెక్కు లేల ? యవ ♦ మానకరంబుగ నిన్నెనీవెయా
ర్భాటముఁజేసికొందువె ప ♦ రాక్రమవంతుని నిన్నెకాదునిన్
గోటనుమీటఁజాలు మద ♦ కుంజరవైరులఁ గాంచియున్ననన్
మాటలు సెప్పియిట్లు బతి ♦ మాలుకొనందలపోయుచుంటివా! ॥

వీర — [ ఆలోచించి తనలో ] ఈకుమారునిగాంచినదాది నామ నంబేలకో డోలాందోళితమగుచున్నది. ఏలకో వీనిమెడ నాకుఁ బుత్రభావము గల్గుచున్నది. రిపుసందర్శనమాత్రముననే ప్రజ్వలితమగు నాప్రతాపాగ్నివీని కర్ణశూలాయమానంబులగు కఠోరవాక్యసమిధలవల్లనైన రాజకున్నదేమికతంబు ననో తోఁపకున్నది. ఎట్లైన నీ నిష్కైతుకజాయమానకృపాకటాక్షముల మరల్చి క్రోధారుణిత నేత్రములతోఁ గఠినత్వము వహింపవలెను. ( ప్రకాశముగా ) బాలకా ! యేల నిష్కారణముగాఁ జెడిపోయెదవు. బాగుగా నాలోచించుకొనుము. పిదపఁ జింతించిన లాభము లేదు. బాలుఁడవు జాగ్రత్తసుమీ.

ప్రతాప — ఉ॥ బాలుఁడుబాలుఁడంచు బహు ♦ భంగులహేళన [ సేయుదేమదా
భీల శరానలంబులఁ ద ♦ పింపఁగఁజేసిన మీఁదనైన నే
బాలుఁడనో మదోద్ధతుల ♦ పాలిటికాలుఁడనో గ్రహింపఁగా
జాలుదుగాక యేమిటికి ♦ జాలము? కాలము వ్యర్థమయ్యెడున్ ॥

వీర — ఓరీమూఢుఁడా ! నానిశితకరవాలంబుచే నీశిరంబు ఖండించి యలుగావించెద. ( అనికొట్టఁబోయియాశ్చర్యమునఁ దనలో ) వైరివీర శిరంబులపై నిర్వక్రవిక్రమంబునఁ బోవు నాకరంబేలకో నేఁడు జంకుచున్నది. ( ప్రకాశముగా ) బాలకా !

చం॥ కరుణవహింతు నీదగు ము ♦ ఖంబును గాంచినదాదియాజిలోఁ
గరములురావు నీశిరముఁ ♦ గంధరమున్ విడఁదీయుబుద్ధిమై

శరణమటంచు వేఁడి మనఁ ♦ జాలునుపాయముఁజూడవేని దు
ర్భరమరణంబు తప్పదు నృ ♦ పాలకుమారక! పారఁజూడుమా॥

ప్రతాప — (నవ్వుచు) ఏమనుచుంటివి! ప్రాణభయంబున నీకు శరణుచొరవలయునా?

ఉ॥ భూరిపరాక్రమ ప్రముఖ ♦ పూరుషసింహుఁడ వాఁడుగాక పె
న్వీరులనాజిఁ గెల్చుటను ♦ వీరశిఖామణి వాఁడుగాక ప
ల్మారు యశస్సరోవరము ♦ లన్ దలమున్కలుగల్గఁగాక నేఁ
డేరికిగెల్పు కాఁగలదొ ♦ యేర్పడఁజెప్ప నెవండెఱింగెడిన్?॥

మఱియు.

మ॥ వెలఁదిన్ గాను భవత్ప్రతాపముల ను ♦ ద్వేగంబుతోఁజూచి దో
సిలిజోడింపఁగ శౌర్యజీవనుఁడనౌ ♦ సింహప్రతాపాఖ్య ని
శ్చలచిత్తంబుగలంగునే ప్రతినవృ ♦ క్షస్కంధముల్ గాక భూ
ధ్రలిశైలంబులు గూలునే మహితఝం ♦ ఝామారుతో ద్వృ

[త్తిచేన్॥

వీర — అట్టులనా!

తే॥ గీ॥ ఎంత చెప్పినఁగాని ర ♦ వ్వంతయేని
వినని దోషఫల మనుభ ♦ వింతువిపుడె
(ఖడ్గముఁదీసి) రమ్ము! మాటలిఁకేల? కా ♦ ర్యమునఁజూపి
విగతగర్వునొనర్తు ని ♦ న్వెఱఁగుఁజెంద॥

(అని, కొంతవడిపోరినఁ బ్రతాపసింహుని ఖడ్గమువిఱుఁగుచుం) స్వపరబల తారతమ్యవిరహితా! మూఢచిత్తా! ఇప్పుడైనను దెలిసినదా?

ప్రతాప — ఇంతమాత్రమునకే!

వీర — అట్లులేని వేఱొకఖడ్గము దెచ్చుకొనుము. (ప్రతాపుఁడు వేఱొకయాయుధమును గొనుచుండ.)

వీర — (తనలో) ఈఘట్టివాఁడసాధ్యునివలె నున్నాఁడు. ఈతని మాటలంబట్టి వాకుశ్చూరుఁడనుకొంటిని గాని నిజముగా నీతఁడు

నచ్ఛ్ఛారునివలెనే కాన్పించుచున్నాఁడు. ఆహా ! దైవమా ! నాకిట్టికుమారునొక్కని బ్రసాదింపకపోతివిగదా కానిమ్ము.

ప్రతాప — ఓయీ ! యేదీమరలరమ్ము.

వీర — సరే ! కానిమ్ము. (అని కొంతవడిపోరఁగా వీరసింహుని ఖడ్గము విఱుగును.)

ప్రతాప — వీరాగ్రణీ ! ఇప్పుడు నేనేమనవలయును ?

వీర — తొందరపడకుము. వేఱొకయాయుధమును గొనివచ్చెదను.

ప్రతాప — మంచిదటులనే రమ్ము. (వీరసింహుఁడాయుధమును గొనుచుండఁ దనలో) తొలుదొల్త నీతని వాక్యములం బట్టి యీతఁడు వట్టి నిష్ఫారుషుఁడనియు బెదరింపులచే నన్ను బంపివేయఁ జూచుచున్నాఁడనియుఁ దలంచితి. కాని నిజముగా వీరసింహమువలెనే కాన్పించుచున్నాఁడు. ఎంతదయాళువైనను వైరిపోటుమాటలను సైతమువిని యూరకుండఁ గలఁడా ! మాయంతరాత్మలకెద్దియో పరస్పరసంబంధముండి తీఱవలయు. లేకున్ననిట్టిజాలి కలుగనేరదు. ఈతఁడు మాత్రం ప్రియగు వీరసింహుఁడు గాఁడుకదా ! మాతల్లి వర్ణనల స్మరించుకొనిన నీతఁడేయని తోఁచుచున్నది. మిత్రుఁడో కాదని తెల్పుచున్నాఁడు. కాని నాకు సందేహముగానే యున్నది. కావున వానినేయడిగి నాయనుమానంబును దీర్చుకొనెద. (వీరసింహుఁడు ముందునకువచ్చును. — ప్రతాపుఁడు ప్రశాశముగా) వీరాగ్రణీ ! నీవెవరవు ?

వీర — (తనలో) ఇది ప్రశంసయా ? పరిహాసోక్తియా ? ఆహా ! యీకళింగు లెంతకేనియుం దగినవారు. తనజేని ముందు యౌవనోన్మాదంబునఁ బంతంబులుపల్కి నేఁడీవీరసింహాలోకనంబున భయకంపితమానసుఁడై మెల్లని యుద్ధంబు నుమానఁ బ్రియత్నించుచున్నట్లు తోఁచుచున్నది. ప్రాణరక్షణంబునకై నన్నిట్లు వందివలెస్తుతించి ప్రాణంబులు దక్కిం

చుకొని నిజపురంబునకరిగి ద్వంద్వయుద్ధంబునకు రాఁగల వీరుఁడున్న రమ్మనిపిల్వ నాంధ్రరాష్ట్రమందొక వీరుఁడైన రాకపోవుటంజేసి తుదకు వీరసింహుఁడే యరుదెంచి నాతోడి కయ్యమున కియ్యకొని సమానుఁడగుటంజేసి మేమన్యోన్యమిత్రభావంబున మెలంగితిమని పొంగుచు మాయాంధ్ర లోకమునకెల్ల నింద నాపాదించుచునుగావున నీరల నమ్మఁజనదు. మఱియు నిప్పుడు వీనివిడిచిపుచ్చితినేని తిరిగి దేశముపై నిట్లె రావచ్చును. కాన నొకసారి బుద్ధిచెప్పి పంపితినేని నాదేశంబున కేభయంబును గల్గఁబోదు.

ప్రతాప — మూర్తీభవ వీరరసస్వరూపా! యేమియాలోచించుచుంటివి? నీవునిజముగా వీరసింహుఁడవు గావుగదా?

వీర — (తనలో) ఈతఁడు నన్ను గుర్తించెనా యేమి?. లేదు. లేదు. నామాటలను బట్టి యట్లనుకొనుచున్నట్లున్నది. (ప్రకాశముగా) నీవంటి యర్భకులపైకి వీరసింహుఁడుకూడ రావలయునా?

ప్రతాప —

చం॥ కదనము సేయవచ్చినను ♦ గాంచినదాది విచిత్రరీతి నీ
మదిఁగలకోపమెల్ల నభి ♦ మానముగాఁ బరిణామ మొందుటన్
విదితమగున్ భవన్మహిమ ♦ వీరవరేణ్యుఁడ వీవెవండవో
కద! తెలుపంగదయ్య త్రిజ ♦ గన్నుత! నాకికనీయుదంతముం॥

అయ్యా! కోపారుణిత నేత్రంబులతోఁ గరవాలంబు ఝళిపించుకొనుచువచ్చి శాంతరసస్వరూపంబుగా మాఱిన నీముఖవిలాసంబులఁ గాంచిన నాకానందదాయక మగుచున్నది. కావున నీకులనామంబు లెఱింగించి నాకుసంతోషదాయివగుము. నిజముగా వీరసింహుఁడవైతివేని యింకనీతోడి యుద్ధమొనర్పఁజాల.

వీర — (తనలో) నిక్కమా! లేక నన్ను వంచించుటకా? తొలుత నేనెంతబతిమాలినను వినక పోరికివచ్చి యిప్పుడిట్లు

పల్కుట యాశ్చర్యముగానున్నది. కాని యీబాలుఁడసా
ధ్యుఁడు. ఏలనఁగా —

మ॥ పలుసంగ్రామములం జరించితిని శుం । భద్బాహుదర్పాఢ్యులౌ
బలవద్వైరులఁ గూలఁజేసితిని శ । శ్వత్కీర్తి నార్జించితిన్
గలఁడొక్కం డిటువంటివాఁడనుచు లో । కంబందు మున్నెన్నఁడుం
దెలియన్ రాదపురా! యితం డెవఁడొ మూ । ర్తీభూతశౌర్యం
[బొకో ?॥

తొలుత నే యీతఁడు సంధికి వచ్చెనేని పరమసంతోషంబున సంధిగావించుకొనువాఁడనుగాని యిప్పుడు వీనితో సంధిచేసికొనుట మిగుల లజ్జాకరంబు. ఏలనఁగా నింతవఱకును నాకితఁడు లొంగినట్లగపడలేదు. ఇఁక నాతని జయింపనేరక సంధిగావించుకొనెనని లోకము చులకనగాఁ జూచును. కావున నాయాధిక్యముఁ జూపువఱకు వీనితో సంధిసేయరాదు. లేదేని యీనిందాప్రపంచమున నింక జీవింపఁజాలను. కాన నాతని నీవిధంబున హెచ్చరించెద. (ప్రకాశముగా) బాలుఁడా! నీయారంభశౌర్యాడంబరమంతరించెనా? కరవాలంబుండఁగనే కాళ్లుపట్ట నుంకించుచున్నాఁడవా? రాచపుట్టువునంబుట్టి నీయిట్టిసేఁతలకు మనంబెట్టులొప్పె? ఆదిని నామందలింపులలక్ష్యంబుగాఁజూచినప్పుడే నీపైవాత్సల్యమెల్లఁ దొలంగిపోయె. ఇంక నీమాయోపాయములావలఁబెట్టి రణమొనర్పరమ్ము. ద్వంద్వయుద్ధంబునకై పిలిచి యిప్పుడు వెనుకాడెదవేల? యీశరఘాతంబులచే నీయుల్లంబు చిల్లులుగావించెదను రమ్ము.

ప్రతాప — ఓశూరుఁడా! నీశరఘాతంబులకే విఘాతంబు కల్పించెదలెమ్ము. (అని వీరసింహుఁడు బాణమును విడువఁగాఁ ప్రతాపుఁడు తప్పించుకొని — తిరిగి బాణమును విడువఁగా — వీరసింహుని శిరస్త్రము కూలును)

వీర — ( ఆశ్చర్యలజ్జలచేఁ దలవంచుకొని – తనలో ) దైవమా! నేనువీరసింహుఁడనుగానా ? లేక నాపూర్వతేజంబు నానుండి తొలంగెనా ?

చం॥ అడిదముఁ బట్టనేర్చుటదె ♦ యాదిగ భీకరశత్రుకోటినిన్
గడిఁదిమగంటిమిన్ దునుమఁ ♦ గల్గితిఁగాక పరాజయంబులే
యెడవిననైతినేఁటికి మ ♦ దీయ శిరస్త్రము నేలఁగూల్చి యీ
బుడుతఁడు నన్నొనర్చెఁ బరి ♦ భూతునిగానిఁక జన్మమేలొకో! ॥

ఈశిరస్త్రపతనంబుచేఁ బరిభూతుఁడ నగుటయేకాక దుశ్శకునముగూడ స్ఫురించుచున్నది. కానిమ్ము. విధికి బద్ధుండుగాని వాఁడెవఁడు ? విగతశౌర్యాభిమానినై మనుటకన్నఁ జచ్చుటమేలు. ( ప్రకాశముగా ) ఓరీ ! యీదెబ్బతో నీవైనఁ జావవలయును లేదా నేనైనఁజావవలయును. ( అని కుంతంబుతో నొకపోటుపొడువఁగా – దానిని బ్రతాపసింహుఁడు తప్పించుకొనఁ బ్రయత్నించుచుండఁ జేతిలోని డాలు క్రిందఁబడును. దానిని వంగితీసికొనుచుండ నాగ్రహంబుతో వీరసింహుఁడు ఖడ్గంబుతోఁ బ్రతాపుని ప్రక్కలోఁ బొడుచును. ప్రతాపసింహుఁడు క్రిందఁబడును. )

ప్రతాప — ఆహా ! పౌరుషవిహీనుఁడా యెంతనీచకృత్యమునకు లొంగితివి, నిరాయుధుండనై భూమింబడిన యాయుధమును గొనుచుండఁగాఁ గరవాలంబునఁ గూల్చితివి. ఓరీనీచుఁడా ! బహువిధసమర విజయుండవైన దీవిధంబుననే కాఁబోలును.

[ తెరలోఁ గలకలము ]

అయ్యో ! ప్రతాపసింహా ! పడిపోతివా ? మాగతియేమి చేసితివి ? ( త్రివిక్రమాదులు ప్రవేశించి ) నీదేశ గౌరవమును, నాత్మగౌరవమును గాపాడుకొంటివి.

వీర —నీవంటిమూర్ఖుల కిదియేగతి.

ప్రతాప — ఓయీ నీచుఁడా ! యీ నీకార్యమునకై గర్వింప నక్కఱలేదు.

మ॥ వనధిన్ మత్స్యమవై యడంగిన నభో ♦ భాగంబునన్ దారవై
తనువున్ దాఁచికొనంగఁ జూచినను యో ♦ ధశ్రేష్ఠుఁడై నట్టి మ
జ్జనకుండేవిధిఁ బుత్త్రశోకహతుఁడై ♦ శాంతించు? నీయంత మా
తనిచేతన్ గలదింక నమ్మకము వృథా ♦ దర్పోక్తులన్ గట్టుమీ॥

(నిట్టూర్పుతో) హాతండ్రీ! నిన్ను గనుఁగొనుటకై వచ్చితిని. తదన్వేషణంబునకై నాజీవంబు లర్పించితిని. కాని నిన్నుగాంచు భాగ్యమునకైన నోచుకొననైతి. నేఁటితో నాయాశలంతరించెను.

వీర — బాలకా! నీజనకుఁడు నన్నుజంపవచ్చినప్పటికిఁ జూచుకొనెదఁగాని యాతనినామమెద్దియో యెఱింగించెదవా?

ప్రతాప — ఓయీ! వినుము.

తే॥ గీ॥ స్వభుజబలమున నాంధ్ర రా ♦ జ్యంబు నిలిపి
నిఖిలభూపుల సామంత ♦ నృపులఁజేసి
పేరుగాంచిన జగజ్జెట్టి ♦ వీరసింహుఁ
డనఁగ నెవ్వాఁడుగలఁడో నా ♦ జనకుఁడతఁడె॥

వీర — త్రివిక్రమా! ఏమియీయాశ్చర్యము! ఈతనిజనకుండు వీరసింహుఁడఁట. వానికిఁ గొడుకెక్కడ?

ప్రతాప — ఓయీ! నీవనుకొనినట్లాతఁడు పుత్త్రహీనుఁడుగాఁడు. త్వదీయ ఖడ్గపరిఘాతంబునఁ గూలిన యీప్రతాపసింహుఁడే యాతని యనుంగుపట్టి. ఆతఁడెట్లేని నామరణసమాచారంబు విని పుత్త్రశోకావేశంబున మనోవేగంబుతో వచ్చి నినుబరిమార్పఁగలవాఁడు. నేనేబ్రతికియుండిన నీచావుఁ జూడకపోను. కట్టా! ఆతఁడీ పుత్త్రశోకసాగర మేవిధంబునఁ దరించును.

వీర — (తనలో) అయ్యో దైవమా! నిజముగా నీతఁడు నాకుఁ బుత్త్రుఁడా? [ప్రకాశముగా] ఓకళింగవీరా! అనృతాలాపము లాడెదవేల? వీరసింహునకుఁ గల్గినదొక కుమార్తెయేకదా.

ప్రతాప — ఓ ఆంధ్రవీరా! అవసానసమయమందున్నవారి జిహ్వాగ్రములయందు సత్యదేవత తాండవమాడుచుండునని యెఱుంగవా? నామాట సత్యము. ఇంకను నాపుట్టువునుగూర్చి నీకు సందియమున్నచో వీరసింహుఁడు గర్భవతిగానున్న నాతల్లి వనిఁ బాయునపుడు పుట్టఁబోవుబిడ్డకుఁగట్టవలసినదని యొకరక్ష నొసంగెను. నాదక్షిణ హస్తమందది కట్టఁబడియున్నది. చూడుము. [ అని చేయియెత్తును. ]

వీర — [ గద్గదికతో ] ఏదీ! ఏదీ! [చొక్కాయిపైకెత్తి భుజమునకుఁ గట్టిన రక్షఁజూచి] హాపుత్త్రా! [అని గుండెఁజఱచుకొని మూర్ఛిల్లి పడిపోవును.]

ప్రతాప — [ ఆశ్చర్యమునఁబ్రాఁకుచు సమీపించి ] అన్నా! యీతఁడే నాతండ్రియగు వీరసింహుఁడా! ( భుజముఁదట్టుచు ) వీరాగ్రణీ! నీవే నాతండ్రివగు వీరసింహుఁడవా?

వీర — [మూర్ఛనుండి తెప్పిఱిల్లి] కుమారా! పుత్త్రఘాతకుండగు వీరసింహుఁడను నేనే (అని కౌఁగలించుకొని దుఃఖముతో)

కం॥ అరివీరుల దునుమాడిన
కరవాలముతో నెతుదకుఁ ♦ గన్నకుమారున్
గరుణాహీనతఁగూల్చిన
చిరతరదుర్యశుఁడ వీర ♦ సింహుఁడ నేనే! ॥

[ అని గుండెచఱచుకొని మీఁదఁబడి యేడ్చును ]

ప్రతాప — తండ్రీ! యూఱడిల్లుమూఱడిల్లుము.

వీర — నాయనా! యింకేమని యూఱడిల్లుదునోయి? కడుపారఁ బెంచి కౌఁగలింపవలసిన చేతులతో నిన్నుఁ జెగటార్చితిని. ఆహా! క్షాత్త్రధర్మమెంత క్రూరకృత్యములనైనఁ జేయించును గదా. తొలుత నిను జంపుటకుఁ జేయాడకున్నను బౌరుషంబు

న్నకై ప్రతినవట్టితిని. కాని సాన్యముగాక మాయోపాయమున నిన్నుఁ గడతేర్చఁజూచితిని. అన్నా! నీయట్టివాఁడు నాకుమారుండన్న సంగతి యెఱింగినచోఁ బృథ్వీలోకాధిపత్యము వహించిన సంతసమునకన్న నెక్కుడు సంతోషమనుభవించియుందును గదా. కుట్టి! మహాపాతిహుర్తైన నీకలిదండ్రులే నీచావునకుఁ గారకులు. స్త్రీశిశువు జన్మించినదని నాకు వార్తనంపి నీ తల్లి నన్ను మోసగించె. అయ్యో! యీమాటలనమ్మి నిన్నుం తగాఁ బరిగణింపనైతి. నాదురదృష్టంబునఁ గాక నేఁడేల యీ ప్రచ్ఛన్నవేషంబున సమరాంగనికి వచ్చితిని? వచ్చితినిబో! నీవు నాయుద్యంతి మడిగినప్పుడు తిరిగి నేనేల నీయుదంతమడుగనైతిని? అడుగనైతినిఁబో! నీవు నొక్కనొక్క వీరాగ్రణీ! నీవు వీరసింహుఁడవా? నిజముచెప్పుమని యడిగినప్పుడైన నానిజవృత్తాంతమును మఱుఁగుపఱుపనేల? ఆహా దైవమా? నాకెట్టిబుద్ధిని గలుగఁజేసితివి? నేనెంతటి మందభాగ్యుఁడను. నాయనా! నీవైన నీవృత్తాంతమును దెల్పక మఱుఁగుఁజేసితివేమోయి? పుత్త్రరత్నమునుబ్రసాదింపఁడేయని పలుమాఱు దైవమునుదూఱితిని. నాదౌర్భాగ్యతను నిందించుకొంటిని. ఎక్కటా! నిష్కారణ దైవదూషణకి ఫలమనుభవింపవలసివచ్చెఁగాఁబోలు. దేవుఁడొసంగినఫలమును గర్వాతిరేకంబున నాశనమొనర్చుకొంటిని. ఇంకవేయిజన్మంబుల తపంబొనర్చిన నిట్టికుమారరత్నంబు గల్గునా? నాయట్టి మహాపాపకర్ముఁడుగాక యింకెవ్వఁడు తన కన్నకుమారుని చేతులారఁ జంపుకొనును? అయ్యోకుమారా! నీబ్రతుకు క్షణభంగురంబగు తటిల్లతవలె మెఱసి పడిపోయెనే?

[ ఆయుధమువంకఁజూచి ] ఓ ఖడ్గమా!

తే॥ శాత్రవులఁ జంపఁదగిన శ ♦ స్త్రంబనీవు
కలుషమొనరింపఁదోడ్పడి ♦ కరినవృత్తి

గర్భసుతుఁ గూల్చిన మహాప ♦ కారమునకు
వీరసింహుండు నేఁటితో ♦ విడిచిపెట్టె ము॥

( అని ఖడ్గమునావలకుఁ ద్రోయును. )

ప్రతాప — ( నిట్టూర్పుతో ) ఏల దింపించెదవు ?

తండ్రీ ! నీచేతులలోఁ జావవలసినదని పుట్టినప్పుడే విధాత, నానుదుట లిఖించియుండఁగ నేఁడన్యథా జరుగునా ? మన ప్రథమ సందర్శనంబునందె మీయుర్వర కన్యాదానంబు గల్గెఁ గాని దురదృష్టవశంబున దానిఁ బాటింపక యుద్ధమునకుదిగి దైవవిధి నెఱవేర్పఁజేసితిమి. కానఁ గడచినదానికై నీవు పరితపించిన లాభము లేదు. ఇఁక నేనో యెవనిఁ గనుఁగొనుటకై పరితపించి వీరవేషంబున దేశంబులెల్లఁ దిరిగితినో యట్టి వీరసింహుని, నాజనకుని నిన్నుఁ గనులారఁ గాంచగల్గుటయే కాక నీవంటి లోకైక వీరసింహునితోఁ బోర వీరస్వర్గమలంకరించుటకన్న భాగ్యమేమున్నది ? నాజన్మము పావనమైనది ఇదియే చాలును కాని

సీ॥ నాకన్నతండ్రిరో ! ♦ నానాన్న యటంచు నన్
ప్రీతిమైఁ గోరఁ ♦ బిలువనిమ్ము
నాముద్దుజనకుఁడా ! ♦ నానాన్న యటంచు ని
న్నాశదీఱంగ ము ♦ ద్దాడనిమ్ము
నాకూర్మిజనయిత ! ♦ నానాన్న యటంచు లా
లించి కౌఁగిటఁ గౌఁగ ♦ లింపనిమ్ము
నాకూర్పుతండ్రిరో! ♦ నానాన్న యటంచు నీ
యంకపాళిని జోల ♦ లాడనిమ్ము
గీ॥ చివరకొకసారియైన నా ♦ చిన్ననాఁటి
ముద్దులెల్లను దీర్చి పం ♦ పుమిఁక నన్ను
నంతకంతకు హృతిదగ్గ ♦ మగుచునగదవె
వేగముగ లెమ్ము యింకజీ ♦ వింపఁజాల !

వీర — నాయనా! నీముద్దులుదీర్చుకొను ఋణమేనాకున్నచో నింతజరిగియుండదుగదా. [ అని కౌఁగలించుటకుఁజేతులుచాఁచి]

కం॥ రారాముద్దులకుఱ్ఱా!
రారాలోకైకవీర! ♦ రవిసమధీరా!
రారామారశరీరా!
రారానను గన్నతండ్రి! ♦ రారా! రారా! ॥

[ అని ముద్దాడుచు నొడిలోఁ బరుండఁబెట్టుకొనఁగా ]

ప్రతాప — జనకా! నామరణమునకై నేనంతచింతింపనుగాని నాతల్లిం దలఁచుకొనినకొలఁది నాగుండెలపియుచున్నవి.

తే॥ అనికివలదంచు నెంతచె ♦ ప్పినను వినక
యఖిలజగదేక వీరవి ♦ ఖ్యాతికొఱకుఁ
దరలినేఁడిట్లు నాకన్న ♦ తండ్రిచేతఁ
జచ్చునాకయియెంత వి ♦ చారపడునో? ॥

మఱియునో జనకా!

తే॥ అనికినీవేగి తవనుబా ♦ సినఁదఖాది
యునురులన్నియునాపైన ♦ నుంచుకొనుచు
జీవయాత్రియదెట్టులో ♦ చేయుచున్న
ప్రియజనని నన్నుఁబాసి జీ ♦ వించునెట్లు? ॥

వీర — ఆహా! జగన్మోహినీ! నిన్నుమఱచిపోయిన మహాపాతకుఁడనుగదా.

సీ॥ అలకళింగస్థితో ♦ ద్యానమందిరమునఁ
ప్రేమతోనన్నుఁ బ్రా ♦ ర్థించునాఁడు
గాఢానురాగమై ♦ కౌఁగలించుచునన్ను
మఱతువేయని బతి ♦ మాలునాఁడు
కరపాశములతోడఁ ♦ గంఠంబుమెలివైచి
ననువీడిపోవొదే ♦ యనెడునాఁడు

జయశాలివైనాథ ♦ సత్వరంబునవత్తు
వేయంచుఁగన్నీరు ♦ వెట్టునాఁడు
గీ॥ నలరునలమోహినీ విగ్రహముఁదలంపఁ
దఱుఁగుఁ(కొ)నిపోవుఁగదవె డెం ♦ దంబునేఁడు
భూతలంబున ననుబోలు ♦ పాతకుండుఁ
గరినహృదయుండుఁ గ్రూరుండుఁ ♦ గలఁడెచూడ ?॥

అయ్యో జగన్మోహినీ! భువనైకధనుర్ధనుండగు నీకుమారుని గుమార్తెఁగాఁ జేసి వార్త నంపియుంటివే! తదన్నృతాలాపఫలంబీ విధంబునఁ బరిణమించెఁగాఁబోలు. నీవావార్త నంపకున్నచో నింతటి ఘోరకృత్యము జరిగియుండెడిదికాదు. పుత్రాతురుఁడనైయున్న నావాంఛయుఁదీరెడిదిగదా.

ప్రతాప — తండ్రీ! విధికృత మలంఘ్యమని యెఱింగియు నేల యిట్లు పరితపించెదవు? పరలోకమునకుఁ బోవుచున్న నీకుమారుఁడెవ్వరో రెండుమూఁడు వరములనడుగుచున్నాఁడు. నాయీతుదివరంబులఁ బ్రసాదించి నీపుత్రవాత్సల్యమును బ్రకటించుకొనుమని నమస్కరించుచున్నాఁడను.

త్రివిక్ర — వీరసింహా! యింతకంటె నవశ్యాచరణీయమైనదేదియును లేదు. కావున వాగ్దానమొసంగుదును.

వీరసింహుఁడు — అయ్యో!

చం॥ తనయుల ముద్దుముచ్చటలు♦తద్దయుఁదీర్తురు తండ్రులెందు న్నే
జనకుఁడనయ్యునిన్ గనియు ♦ సంగతినయ్యో! మదేకపుత్ర! యే
మనినను గోరెదీవు భవ ♦ దంతిమ వాంఛితమైనఁదీర్తు వే
గ్రొనఁగదెకుఱ్ఱ! పాసినొప ♦ గూర్పఁగనేనిదె బాసచేసెదన్॥

ప్రతాప — జనకా! అట్లనివినుము.

చం॥ జనక! భవద్వియోగమున ♦సంతతదుఃఖ నిమగ్నయయ్యుమా
జననియెటోనసుంగనుచు ♦ శాంతియొకింతవహించెఁగాని నేఁ

డనఘు! మహీయుదుర్గతికి హా! యని ప్రాణముబీడనున్న నా జననికి నీసుదర్శనము సాగి విషాదము మానఁజేయుమీ! ॥

వీర — అయ్యో! ఆపె ముఖంబును నేనెట్లుచూడఁగల్గుదును?

మ॥ ఇదిగోవచ్చెదనంచుఁ జెప్పియుఁ బదే నేండ్లైననెవ్వెసినా వదనంబాపెకుఁ జూపనైతినసకే పైపెచ్చు నేనేయిటుల్ కదనంబందు. దనూభవుం గెడపితిన్ గట్టా! ఎఁకే మోముతో సుదతిన్ జూతును! జూచియేమనుచుఁ దచ్ఛోకంబు వారించెదన్ ॥

ప్రతాప — తండ్రీ! నక్కారమ్మననీ వాపెను దర్శింపఁబోవ యోదార్పు చో గుండెలవిసి చచ్చుట నిక్కము కావున నాతుదిప్రార్థనయంగీకరించి నాతల్లినిగాపాడుము.

వీర — నాయనా! నాప్రాణమును జంపుకొనినట్టైన నీకోర్కె నెఱవేర్చెదన. ఇంకేమైనఁ గోరెదవా?

ప్రతాప — జనకా! మఱిరెండుకోర్కెలుగలవు. వానినడుగుటకు సిగ్గగుచున్నను దప్పనిసరియగుటచే నడుగుచుంటిని. [తన సైనికుల నిరూపించి] ఈ కళింగరాజానుతెల్లరును నాభుజబలంబును నమ్ముకొని నాపై నాశ పెట్టుకొనివచ్చిరి. కాని వారి నాయకుండనగు నేనే గతించినప్పుడు వారికాశయెక్కడ? కావున వారల క్షమించి మగుడిసుఖముగాఁ గళింగపురిఁజేరునట్లాజ్ఞాపింపుము.

— కుమారా! నిన్ను గూల్చినప్పుడే శస్త్రసన్యాసముగావించితినిగదా ఇప్పుడు తిరిగివీరలతో యుద్ధమొనర్తుననుకొంటివా? లేదు. లేదు. (సైనికులదిక్కై) ఓ కళింగయోధులారా! నేటితో మన సమరంబు ముగిసెను. మీనాయకుండును నాకుమారుండునగు ప్రతాపసింహునికోఱకగు మీదుఃఖమంతయునన్నెపొందనిచ్చి మీరింకఁ గళింగపురమున కరుగుఁడు.

(కుమారునిదిక్కై) నాయనా! ఇంక నీమూఁడవకోర్కె యేది?

ప్రతాప — మాయీపోరాటంబునకు మూలకారణంబగు కళింగ రాజ్యస్వాతంత్ర్యమునకై ధీభుజబలంబులుచూపయత్నించితిని గాని విఫలీకృత మనోరథుఁడనైతిని.

వీర — తనయా! కళింగరాష్ట్రస్వాతంత్ర్యమునకా యీపోరాటము.

ప్రతాప — అవును. మీకై పోరాడి మీకు స్వాతంత్ర్య మిప్పించెదనని మా తాతయగు మాధవవర్మతోఁ బ్రతినఁ జేసి వచ్చితిని.

వీర — తనయా! నేనింక బ్రతికియుండినచో నాకోర్కెయు నెఱవేర్చువాఁడ. నీవింకఁ గోరఁదగినదేమైననున్నదా?

ప్రతాప — తండ్రి! యీవేదన దుర్భరంబుగా నుండుటచే నింక మాటలాడఁజాలను. ఆయాసమెక్కువగుచున్నదిగాన సత్వరంబుగఁ బ్రాణములఁ బాయుకోర్కె కన్న వేఱుకోర్కె లేదు. (నిమీలితనేత్రుఁడై) హా తండ్రి! యివియే నాతుదివందనములుగైకొనుము. (అని వీరసింహుని పాదములపైఁ జేయి వైచి ప్రాణములు విడుచును)

వీర — అయ్యో కుమారా! నన్నుఁబాసి పోవుచుంటివా? (అని మీఁదఁబడి యేడ్చుచు) అయ్యో! నీయట్టి కుమారునిఁబోఁ గొట్టుకొని యింకెట్లు బ్రతుకఁగలను. ఓ దయామయా! నీ కిది న్యాయమా? తోడిమానవుల నెందఱనో శాత్రవులను వీర వధించిన మహాపాతకుని నన్నుయినఁ గొనిపోవక యీపసిబాలు నేల కొనిపోయితివి? ఓ కృష్ణాతరంగిణీమతల్లీ! యీపాపాత్ము నేల నీలోఁగల్పుకొని పునీతుని జేయవు? ఛీ! ఛీ! మహా పవిత్రురాలవగు నీవీ పుత్త్రఘాతకు నంటుదువా? ఓ ధాత్రి

మా ! నీ వెంతపని చేసితివి ? ఖడ్గము లేకదా నీమంత్రులు ? అయ్యో ! ఇంతకన్న సాత్త్వికమార్గ మెఱుంగవా ? కన్నకుమారునినైన గుర్తింపనీయవైతివిగదా ? అయ్యోకుమారా ? అయ్యో జగన్మోహినీ ! నిరపరాధియు లోకైక వీరుండునగు కుమారు నన్యాయముగాఁ జంపినందులకు నన్నెంత దూఱుదువో కదా ! హా దైవమా ! ఎంతకష్టము ! ఎంతకష్టము ! దుర్భరము ! ఇట్టి కుమారుని జంపుకొనిన నేనేమొగంబున నింక జీవింపఁగలను ? పరమేశ్వరా ! నాకుమారునినైన బ్రతికింపుము. లేదా నన్నుఁగూడ వానిననుసరింపనిమ్ము. అయ్యో ! నాకన్నులు గిర గిరఁ దిరిగి పోవుచున్నవి. నాకింకనీ రాజ్యముతోఁ బని లేదు. ఈప్రజలతో నవసరము లేదు. ఈలోకమేవలదు. ( గుడ్డలు చించికొనుచుఁ దలబాదుకొనుచు— మంటిని జిమ్ముచు ) హాభువనైకశౌర్యరాశీ ! హాప్రియకుమారా ! హావత్సా ! నిన్నుఁ జంపిన ఖడ్గముతో నేనుగూడఁ బొడుచుకొని నిన్ననుసరించుచున్నాను. ఆగుమాగుము ! ( అని పొడిచికొనఁబోవ త్రివిక్రమాదులు వారింప మూర్ఛిల్లి పడి పోవును. త్రివిక్రమాదు లూరడించుచుందురు)

వసంతు — ( తనలో ) అవురా ! పుత్త్రశోక మెంతదుర్భరము! ధైర్యధనుండగు నీమహామహుఁడే యిట్లు మూర్ఛిల్లెనే! స్వామికార్యము నెఱవేఱుటచే సంతోషమబ్బుననుకొంటిని గాని లోకైకపరాక్రమవంతుఁడగు నాచిన్ని చెలికాని గోల్పోవుటచేతను, వాని ప్రియజనకుఁడును త్రిలింగసామ్రాజ్యస్థాపనాచార్యుఁడు నగు వీరసింహుని దుర్భర పుత్త్రమరణావేదనను జూచినచో హృదయము నీరైపోవుచున్నది. ( ప్రతాపసింహుని సమీపించి ప్రకాశముగా ) మిత్రమా ! చివరకు నీకిట్టిగతిపట్టెనుగా ? అయ్యో దైవమా !

సీ॥ వీరాగ్రగణ్యుఁడౌ ♦ వీరసింహాంక స
త్కులవారినిధిజాత ♦ కుముదహితుఁడు
భువనైకనుత జగ ♦ న్మోహినీమానినీ
గర్భాంబురాశి ము ♦ క్తాఫలంబు
తతకళింగావనీ ♦ ధవుని జాహితుండు
స్వాతంత్ర్యబద్ధ దీ ♦ క్షాపరుండు
భుజబలోద్ధతిచేత ♦ భువనత్రయంబైన
నెదిరింపఁజాలు శౌ ♦ ర్యైకధనుఁడు

తే॥ కట కటా! మేనుదొరఁగ సం ♦ గ్రామమందు
రక్తమాంసంబులను ధూళి ♦ గ్రమ్ముచుండ
నపరవారాశిఁబడు సహ ♦ స్రాంశునట్ల
శ్రీలుచున్నాఁడు నాచెలి ♦ కాఁడునేఁడు॥

త్రివిక్రి — మిత్రులారా! కడచినదానికిప్పుడు చింతించిన లాభము లేదు. పుత్రశోకావేశంబునవీరసింహు నోదార్చుటకుమాఱుమనమును జింతించుచుంటిమేని ముప్పవాటిల్లును. కాన సత్వరముగ వీరసింహుని రణరంగమునుండి పురిలోనికిఁ గొనిపోవలయును. మఱియు వీరస్వర్గమలంకరించిన యీపవిత్రాపుని యాత్మశాంతికై పరమేశ్వరుని బార్థించి పౌరజలన్యోన్యమిత్రభావంబున మెలంగునట్లు దీవించి తదుపరి మనమీశౌర్యధన్యుల నామంబులు శాశ్వతముగానుండుటకై యీకుమారుని సమాధిని గృష్ణాతటంబుననిర్మించి దానిపైనొక స్తూపంబునుగట్టి వీరివిషాదకరమగు చరిత్రమందు వ్రాయునట్లుచేయుదము.

వసంతు — మిత్రమా! అటులనే పరమేశ్వరుని బ్రార్థించెదను,

మ॥ అనుగున్నెచ్చెలికాఁడు బాలకుఁడుమీ ♦ ర్యప్రాజ్య తేజస్వియు
న్ఘనకోదండ కృపాణబాణ విలస ♦ ద్గాండీవి సామ్యుండు దు

ర్జన మస్త్రభమ్మ గెం(ద్రుఁడా నితఁడు వీ ♦ రస్వర్గ మాసించుచున్
నినుజేరెంగద వానియాత్మకుఁ బ్రశాం ♦ తింగూర్పు మాఖండలా॥

భ ర త వా క్య ము.

సీ॥ క్షాత్రమే ముఖ్యంబు ♦ గాఁ దలంచుచు రాజు
లూరకే కలహింప ♦ కుందురుగాత !
భారతా వనియెల్ల ♦ వర్షసమృద్ధిచేఁ
బాడిపంటలు గల్గి ♦ పరిబెలుఁగాత !
స్వమత దేశాభిమా ♦ నములతో వర్ధించి
వీరపూజలను గా ♦ వింతురుగాత !
వీరప్రతాప దో ♦ ర్వీర్య ప్రతాపముల్
నిఖిల హైందవులందు ♦ నిలుచుఁగాత !

గీ॥ హైందవుల కైకమత్య మిం ♦ పొందుఁగాత !
ఆంధ్రమాత యశమునఁ జె ♦ న్నారుఁగాత !
దేశమంతట శాంతి వ ♦ ర్ధిల్లుఁగాత !
శ్రీపరాత్పరుఁడు మిము ర ♦ క్షించుఁగాత ! ॥

శ్రీ. శ్రీ. శ్రీ.

ఇది అష్టమాంకము.



# పండిత కవివరాభిప్రాయములు.

సరసచతుర్విధ కవితాసామ్రాజ్య ధురంధరులగు నాదెళ్ల పురుషోత్తమశాస్త్రిలుగారు — బందరు.

వీరప్రతాపనాటకమును బ్రదర్శనమునఁ జూచితిని. గ్రంథముం జదివితిని. కవినాశిష్యుఁడయినందున మానసోత్సాహమున్న దెల్ల వెల్లడింపనొల్లక క్లుప్తముగా వ్రాయవలసినవాఁడనయితిని. ఈకవితనుగల ధారాళగతియు మృదుమధుర శైలియు నటుండ సమయోచితరసము లొప్పింపఁబడిన పొందిక ముద్దుగనున్నది. ఈకవికిది ప్రథమ ప్రయత్నమయియుండఁగను నిట్లుంట నెక్కువగా వర్ణింపఁదగినదైనది. విషాదాంతమగుట ప్రాచీనసంప్రదాయభిన్నమని యెఱింగియే ముఖపత్త్రమునఁ గవి తానవ్రాసికొనియుండ నదియొరులెంచనేల ? నవీనరంగమునఁ బెక్కుఅమెప్పే పడసినదాయె.

మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు. కావ్యనాటక నిర్మాతలు నరసారావుపేట.

,, తమరు దయతో నాకంపిన మీవీరప్రతాపనాటకమునే నామూలాగ్రముగఁ జదువుటయేకాక విద్యాధికులును నటప్రసిద్ధులనగు నామిత్రులకును జూపితిని. విమర్శనాపూర్వకంబుగఁ దిలకించి మిక్కిలి సంతసించిరి. ఎందునను లోపమేమియుఁ గనుపింపకుండుటచే నిది ప్రథమప్రయత్న మనిపించుటలేదు. కథావిభజనయందును (Plots) గ్రంథరచనయందును మూలమునకన్న

మిన్నయై సొమ్మునకు మెఱుఁగుఁబెట్టినట్లున్నది. దూరస్థుఁడ నగు నాకీగ్రంథరాజమును జదువునవకాశము గల్గించినందులకెంత యుఁ గృతకృత్యుఁడనగుచు నిట్లనివిన్నవించుచున్నాను.

ఉ॥ సత్కవులున్ బుధుల్నటులుఁ జాలహసాదని మెచ్చుపద్యర
త్నోత్కర మొప్ప మంజులమృదూక్తులు రక్తిఘటింపశౌర్యసం
పత్కర వీరసింహనరపాల సనాథ కథాభిరామమౌ
త్వత్కృతనాటకంబలరుతన్ భువినావిధుతారకంబుగన్ ॥"

---

శ్రీ రాజా విక్రమ దేవవర్మగారు. బహునాటక కర్తలు,

విశాఖపట్టణము.

"అనుగ్రహించి పంచిన వీరపత్రావమను నాటకమును జదివితిని. వారుదానిని విషాదాంతముగా రచించిరి. అందలి యితివృత్తమన్య దేశజులదయినను దానినే తద్దేశవాసుల దయినట్లు మార్చుట యెంతేయు సమంజసముగానున్నది. అది శృంగారవీర కరుణారసములతో నొప్పుచున్నది. ౧౦౭ వ పుటయందలి సీసపద్యము జదువునపుడెంతటి గట్టిగుండెగలవారికైనను మానసుసీరైయదికన్నుల గుండంజిందకమానదు. శైలిమృదువై సుబోధముగా నున్నది. అవీరోచిత ఘాతంబుచేత సుతునిజంపినందులకు వీరసింహుఁడును బతిపుత్త్రులను బాసినందులకు జగన్మోహినియును దాను నిజమును గప్పియుంచుటవలన మిత్రమరణముగలిగినందులకు వసంతుండు నాత్మహత్యఁజేసికొని మరణించియుండు రేని యది సంపూర్ణవిషాదాంతమయి యుండును. చేయంబూనినచో దేనినైనను సంపూర్ణముగా నొనర్పవలెనుగదా. ఇతివృత్తమును మార్చువధికారము నాటకరచయితలకుం గలదు."

---

ఉమర్ అలీషాగారు, సుప్రసిద్ధాంధ్రకవులు. పిఠాపురము.

కం॥ వీరప్రతాపనాటక
మారయ సాహరాబురుస్తుమను వీరుల స
చ్చారిత్రమతి విషాదము
గా రచియించితివి రసవికాసముగా గన్॥

ఉ॥ రూపకమా సుధామధుర రూపమునై పొలుపారు పాత్రలం
దోపరిపూర్ణమౌ చితి సముజ్జ్వలకాంతి వెలార్చు దుఃఖసం
తాపరసంబు నేవగిదిదహ్యా మొనర్చునో మానవాళినా
రూపముజూపుచున్నదతి రూఢిని వీరప్రతాపరూపమున్ ॥

తే॥ గీ॥ అవని "ఆవటపల్లె" వంశాబ్ధిచంద్రు
డైనమాహనుమంతరాయ ప్రధాని
సుకవివీరప్రతాప నాటకమువ్రాసి
లోకమునకిచ్చె కాన్క విలోకియగుచు॥

శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన బిరుదాంకితులును శతావ
ధానులునగు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు. కడియము.

"మీనాటకము స్థాలీపులాకన్యాయముగా జదివిచూచి
నాను. ధారచక్కగా నిర్దుష్టముగానున్నది. చూచినంతలో నాకు
లోపములగుపడలేదు. భగవంతుడిట్టి గ్రంథములను వ్రాయుపూ
నిక మీకొసగి మిమ్ము గృతార్థులను జేయుగాక."

వడ్డాది సుబ్బారాయడు పంతులుగారు. ఇదివఱలో రాజ
మండ్రి ట్రెయినింగు కాలేజిలో బ్రధానాంధ్రోపాధ్యాయులు
సుప్రసిద్ధాంధ్ర నాటకకర్తలు. రాజమహేంద్రవరము.

"సాదరముగా దమచేత నంపబడిన భవద్విరచిత గద్య
పద్యాత్మక వీరప్రతాపనాటక మెనిమిదంకములును సావకాశము

గాఁ జదివితిని. పత్రికలో మీరు వ్రాసియుండనిచో నాటకరచనకిది ప్రథమ ప్రయత్నమని చదువరులు తెలిసికొనుటకు మీ కవనధోరణి యవకాశముకలిగించుటలేదు. నాటకమునందలి గద్యపద్యములు రసానుగుణ వృత్త్యాదులచే రాజిల్లుచున్నవి. పాత్రముల పేళ్లు మార్పఁబడినను విషయమాంధ్ర చారిత్రమునకు సంబంధించినది కాకపోవుటచేత నాటకప్రయోగము చూపఱకుఁ జిత్తాకర్షకముగానుండదేమో యని సందేహము. ఏదియెట్లున్నను జివరపూఁడంకములుమాత్రము కరుణారసమును వెల్లిగొలిపి యెల్లరకునుల్లాసము నుత్పాదించునని నమ్ముచున్నాను.

జనమంచి శేషాద్రిశర్మగారు. మహాపురాణకర్తలు. కావ్యతీర్థ బిరుదాంకితులు. కడప.

« తమరు కరుణారసపూర్ణ హృదయులరై పంపిన వీరప్రతాపనాటకమందినది. ఇంచుమించుగా నంతయుఁ జదివితి. ప్రాచీనాచారము నతిక్రమించి విషాదాంతముగా వ్రాసితిరనుట యొక్కటియె నాకువిచారము. పద్యములు మిగుల హృద్యములుగాఁ జెన్నారుచు రససమృద్ధిని దెలుపుచున్నవి. మాటలు తేటతెల్లముగ సద్భావమును జాటుచున్నవి. కథావిధానము తికమకగాక సుబోధకముగానున్నది. ఆరయఁగా నీసుకృతి మీపూర్వసుకృతి పరిణామమును దెలుపుచున్నది. నిక్కముగా నాచిత్తము మహానంద వాహినీ నిమగ్నమైనది. భగవదనుగ్రహమున నీనాటకము మీకీర్తిని ఆంధ్రదేశమున నన్నితావుల వ్యాపింపఁజేయుఁగాక. భగవంతుడు మీకాయురారోగ్యములు ప్రసాదించి యిట్టి యనేకనాటకముల రచియింపఁజేయుఁగాక.

నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రిగారు. పత్రికాధిపతి.

బందరు.

మ॥ వినవింపౌ మృదుగద్య పద్యసరణిన్వీరప్రతాపాఖ్యమౌ
లైనదిట్లో హనుమంతరావనటపల్లెఖ్యాత వంశ్యుండు ప్రా
క్తన సిద్ధాంతమతిక్రమించిన విషాదాంతంబు కానైన నూ
తనపక్కీందగు నాటకంబులఁ బ్రశస్తంబిద్దియా నెట్టులున్ ॥

మ॥ కలిగెన్నుండిటి వ్యత్మిట్టులను ప్రఖ్యాతంబుగా నన్యభా
షల మార్పన్రసభంగముంచుఁ గరుణాసంకీర్ణ వీరప్రథా
న లసన్నాటకరత్నము ప్రధమ యత్నంబయ్యు నూత్నప్రబో
ధలముందావగునట్లుకూర్చెఁగద విద్వాంసుల్ప్రశంసింపరే!

---

రాయసం వెంకట శివుడుగారు ఎం. ఏ ; ఎల్. టి. నెల్లూరు.

తమరు పంపిన 'వీరప్రతాప' నాటకమును జదివినాఁడను. అది యింగ్లీషుభాషలోని యొక కథ ననుసరించి వ్రాయఁబడినదైనను జదువువారి కనువాదముగఁ దోఁపక స్వతంత్రమైన భారతీయకథగనే కన్పట్టుచున్నది. కథాసందర్భము చిక్కుగాక చక్కఁగాఁ గూర్పఁబడి యున్నది. ఇప్పుడు వెలువడుచున్న కొన్నినాటకములకంటె మీనాటకము వస్తువిశేషముచేతను బ్రశంసనీయముగనున్నది. మీరిట్లే పరిశ్రమింతురేని మంచి నాటకముల వ్రాయఁగలుగుదురనుట కెట్టి సందేహము లేదు.

నేను జదువుచుండఁగా మీగ్రంథమునందందుఁజూచిన మా కళాశాలలోని ప్రధాన పండితులు, బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు మీపద్యరచన ధారాశుద్ధిగలిగి హృద్యముగానున్నదని తమ యాశయము నాకుఁ దెలిపిరి.